*S. V. University Oriental Series-No. 18*



సాధారణ సంపాదకుడు:

డైరెక్టర్, యస్. వి. యు. ఓ. ఆర్. ఇన్స్టిట్యూట్

# యతిరాజశేఖర వైభవములు

## (రామానుజామృతము)

ఇల్లిందల పరవస్తు రామానుజాచార్య

ప్రణీతము

పరిష్కర్త:

డా॥ కె. జె. కృష్ణమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.,

రీడర్ ఇన్ తెలుగు

యస్. వి. యు. ఓ. ఆర్. ఇన్స్టిట్యూట్



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

ప్రాచ్య పరిశోధన సంస్థ

తిరుపతి

1988

0 320/6-94

**Prof. Dr. D. Sridhra Babu,**
Director-in-charge,
S. V. U, Oriental Research Institute,
TIRUPATI-517502.

# PREFACE

It is a great pleasure to bring out the publication in Telugu called "Yatiraja sekhara Vachanamulu (Ramanujamrutamu)" in the Sri Venkateswara University Oriental Series. This is one of the best examples of the 17th centnry Telugu prose. It is a euology. written in praise of Sri Ramanujacharya, the expouder of the Visishtadavaita School of Philosophy. Sri Illindala Para-vastu Ramanujacharya, the suthor of this 'Vachana Sataka' was a profound scholar of 'Ubhaya Vedantas'. He introduced in this prose work, a new style of language which is neither purely colloquel nor strictly grammatical, but lucid as well as idiomatic.

Dr. K. J. Krishnamoorthy, Reader in Telugu of our Institute, has brought out this critical edition on the basis of four manuscripts,, viz, three palm-leaf Mss. and one paper Ms, adopting the folowing methods:

a) The corrections of scribal as well as grammatical errors.

b) Giving the variations, references and explanatory comments as footnotes.

c) Inserting the punctuation marks where ever necessary.

The editor is to be complimented for his laudable effort in this work.

In this connection, I thank the Government of India for providing the finances towards the publication of this work as a part of their scheme sanctioned to the Oriental Research Institute of S. V. Univerity.

# పీఠిక

శ్లో॥ కాషాయశోభి కమనీయ శిఖానివేశం
దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్।
ఉద్యద్దినేశనిభ ముల్లస దూర్ధ్వపుండ్రం
రూపం తవాస్తు యతిరాజ। దృశోర్మమాగ్రే॥

— అనంతాళ్వార్లు.

# 1 ప్రక్రియ

ఆంధ్రవచనసారస్వతమున 'స్తుతివచనము' లొక విశిష్టమైన శాఖ. క్రీ. శ. 13వ శతాబ్ది ఉత్తర భాగమున సింహాచల క్షేత్రమున విలసిల్లిన భక్తకవి యగు కృష్ణమాచార్యుడు రచించిన 'సింహగిరి నరహరి వచనములు' ఈ కోవలో మొట్టమొదటివి. ఆలయములయందలి అర్చామూర్తుల సమక్షమున ఆయా రాజోపచార దేవోపచార వేళలలో ప్రశంసాపూర్వకముగా పఠించెడు స్తుతిపాఠముల సంప్రదాయములు, భగవద్రామానుజాచార్యులు విరచించిన గద్యత్రయాది గీర్వాణ రచనముల ప్రభావములు, పొరుగువారైన కన్నడిగుల 'వచన సాహిత్యము'తోడి పరిచయములు—వీటన్నింటి యొక్క సమష్టి ఫలితముగా తెలుగున 'స్తుతివచన' రచనా పద్ధతి యావిర్భవించి, పెంపొందినది.

పదకపితాపితామహుండగు తాళ్ళపాక అన్నమాచార్యుడు (క్రీ శ. 1408-1503) ఈ 'స్తుతివచనములను' 'చూర్ణపదములు'గా పేర్కొన్నాడు. ఇవి 'తాళ ఛంధచ్ఛందో విరహితము'లై, 'అనిర్యుక్తములు' (అనియుక్తములు (?) - అనగా అనిబద్ధములు) - అను పేర భాసితములగుచుండునని అన్నమయ్య వచించెను. మఱియు ఈ చూర్ణపదములలో 'తాళప్రమాణమునఁ గడుఁజెలువై' యుండునవి 'తాళగంధి చూర్ణపదము' లనబడుననియు ఆ సంకీర్తనాచార్యుడు నిర్వచించి యున్నాడు.1

---

1 చూ: తాళ్ళపాక కవుల లఘుకృతులు, తి.తి.దేవస్థాన ప్రచురణ (1935), 'సంకీర్తన లక్షణము', ౨౮, ౨౨ సంఖ్యలుగల పద్యములు, అను: తా॥ చిన తిరుమలాచార్యులు.

సింహగిరి వచనములకు పిమ్మట తెనుగులో వెలువడిన స్తుతి వచన రచనలలో తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు (క్రీ. శ. 1468-1553) రచించిన వేంకటేశ్వర వచనములు (వైరాగ్య వచన మాలికా గీతములు), కాసె గంగాధరప్ప (క్రీ. శ. 1525-1575) రచించిన గంగాధరయ్య వచనములు, ఊటె శంకర కవి (క్రీ. శ. 1570 ప్రాంతము) రచించిన భవానీ మనోహర వచనములు (పురాతన శంకర వచనములు), కాశికాధీశ్వర వచనములు (శివయోగవచనములు), లక్ష్మీవల్లభ వచనములు (చతుర్వింశతి నారాయణ విన్నపములు), ముప్పది నాలుగు విన్నపములు మొదలైనవి ముఖ్యమైనవి.

## 2 రచన

కాలక్రమేణ ఇటువంటి స్తుతి వచన రచనలు ఇష్టదైవతములను గూర్చియే కాక, మహనీయులైన మతాచార్యులను, గురుపుంగవులను ఉద్దేశించియు ఆ యా భక్తకవుల లేఖినులనుండి అవతరింపదొడగినవి. అట్టివానిలో అగ్రేసరములు ప్రకృత 'యతిరాజశేఖర వచనములు'. విశ్వవిఖ్యాత విశిష్టాద్వైత దర్శన ప్రవర్తకుడగు శ్రీమద్రామానుజాచార్యుల నుద్దేశించి, ఆయన సన్నిధిలో విన్నవించుచున్న రీతిని రచింపబడియుండుటచే 'రామానుజ విన్నపములు'-అను పేరట నివి ప్రశస్తికెక్కినవి.

i) పరిమితి, పేర్లు :

"శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!" _ అనెడి సంబోధన మిందలి ప్రతి వచనము చివర మకుటముగా కూర్పబడియున్నది. ఇట్టి స్తుతి వచనములు ఈ కృతిలో నూటయెనిమిది యున్నవి. ఇవి అతి చిన్నదైన ఆఱు పంక్తుల (56) వచనము నుండి, అన్నిటికన్న పెద్దదగు ముప్పదియాఱు పంక్తుల (97) వచనమువరకు వివిధ పరిమితులలో విస్తరించియున్నవి. ఐనను వీటిలో చాలమటుకు 10 నుండి 20 పంక్తులలోపు పరిమితి గల్గినవే అధిక సంఖ్యలో నున్నవి.

కవి యీ కృత్యారంభమున ఐదు శ్లోకములలో నొక అవతారికను, కృతి చివర విషయ సంగ్రహసమన్వితమైన ఆశ్వాసాంతగద్యను సంతరించి యున్నాడు. ఇందలి రచనా విశేషములలో ఇది యపూర్వమైన సంగతి!

ఆశ్వాసాంత గద్యయందలి—

అ) '..................రామానుజాచార్యప్రణీతం బైన రామానుజాష్టాశత ప్రబంధ పరికల్పిత పరవస్తుప్రకాశ నిఖిలముముక్షు..................'

ఆ) '..................విన్నప మష్టాశత పరిమాణంబున్నైన రామానుజామృతంబునం దేకాశ్వాసము'.

—అనెడి వాక్య భాగములనుబట్టి కవి యీకృతిని ఏకాశ్వాసాత్మకమగు గద్య ప్రబంధముగా పరిగణించి, దీనికి "రామానుజామృతము"—అని నామకరణ మొనరించినటుల స్పష్టమగుచున్నది.

కాని, మకుటమున గల సంబోధనల ననుసరించి స్వాభావికముగా నేర్పడిన 'రామానుజ విన్నపములు', 'యతిరాజశేఖర వచనములు' - అనెడు పేళ్లుమాత్రమే ఈ కృతి నామములుగా సాహితీ లోకమున ప్రసిద్ధివహించియున్నవి. వీటికి తోడు 'యతీంద్ర అష్టోత్తరము', 'యతీంద్రస్తోత్రము' - అను మఱి రెండు పేరులు ఆ యా తాళపత్రప్రతుల లేఖకులు కల్పించినట్టివి కనబడుచున్నవి. ఇవి యీ గ్రంథ పరిమితిని, ప్రశస్తిని చక్కగా చాటుచున్నవి.

ఇక, ఇందలి మకుటములోని 'శేషనగరాధినాథ' యనెడి మొదటి సంబోధనను వ్రాతప్రతుల వ్రాయసకాండ్రు పాఠకులు ఏమఱుపాటుతో 'శేషగిరినాథ' యని భ్రమించుటవలన వీటికి 'శేషగిరినాథ వచనములు, శేషగిరినాథ విన్నపములు' అను వినూత్నములైన నామధేయములు వ్యవహారములో నెలకొనినవి.

ii) వస్తువు :

యతిరాజశేఖరుడగు శ్రీమద్రామానుజాచార్యులను వేనోళ్ళ భక్తిప్రపత్తి పురస్సరముగా కొనియాడుటయే ఈ రచనయొక్క ప్రధానోద్దేశమగుటచే, ఆ మహా

పీయుని జీవిత విశేషములు, మహోన్నత కార్యసాధనలు, వాత్సల్యాదిగుణగణములు, మహిమాతిశయములు - మున్నగువాని సారము ఇందలి వస్తువు (ఇతివృత్తము)గా పరిఢవిల్లినది.

ఇందలి వచనములు దేనికది విడివిడిగా ముక్తకములవలె కనిపించుచున్నను, వీటిలో ప్రత్యక్షరమున శేషనగరాధినాథుని అవతారవిభవమే అంతటను అంతర్యామియై ప్రకాశించుచున్నది. ఈ కారణముననే కవి యీ కృతిని ఏకాశ్వాసాత్మకమగు గద్య ప్రబంధముగా పరిగణించి, దీనిని 'రామానుజామృత' మనెడు అన్వర్థనామధేయముతో నలంకరించియున్నాడు. 'అమృత' శబ్దమునకు మోక్షమను అర్థముకూడ నుండుటనుబట్టి[2] 'ఈ గ్రంథము మోక్ష దాయకమగునట్టి రామానుజస్తోత్రము'-అనెడి విశేషార్థముసైతము ఇందుమూలముగా స్ఫురించుచున్నది.

iii) మకుటము :

స్తుతి వచన రచనలో కీలకమైనది రచయితయొక్క నైపుణ్యమునకు గీటురాయి యనదగినది అందలి మకుటము. శతకములలోవలె ఇందును మకుటమే రచనయొక్క నామధేయమునకు నిర్ణాయకమై అలరారుచుండును. ఈ కృతియొక్క మకుటమును కల్పించుటలో ఈ రచయితకు 'సింహగిరి నరహరి వచనములు' మార్గదర్శకమైనవి. ఐనప్పటికిని మకుట నిర్మాణమున ఈ కవికి గల చాతుర్యము ఇందు స్ఫుటముగా గోచరించుచున్నది. ఈ విషయమై ఈ రెండు రచనల మకుటములు క్రింది విధమున తులనాత్మకముగా పరికింపదగియున్నవి :

| సింహ॥ నర॥ మకుటము | | య॥ రా॥ శే॥ మకుటము |
|---|---|---|
| సింహగిరి | — | శేషనగరాధినాథ! |
| నరహరీ! | — | రామానుజ! |
| నమో నమో | — | నమో నమో |
| దయానిధీ! | — | యతిరాజశేఖరా! |

2 'శ్రేయో నిశ్శ్రేయసామృతమ్'-అమరకోశము, I కాం. 146 శ్లో., వావిళ్ళ ప్రచురణ, చెన్నపురి (1938).

పై మకుటములు రెండిటిలో మొదటిదానియందు ఈకారాంతములైన రెండు సంబోధనలు నెలకొనియున్నవి. అందొకటి విశేషణము; రెండవది విశేష్యము. రెండవ మకుటమున అకారాంతములగు మూడు సంబోధనలు గలవు. అందు (తిరుమణివలె) మధ్యనున్న సంబోధనము విశేష్యముకాగా (తిరుచూర్ణరేఖల వలె) ఇరుపైపులనున్న సంబోధనలు విశేషణములుగా వెలసినవి. ఇక, నమశ్శబ్ద ద్వయము రెండు మకుటములలోను సమానమే.

కాగా, చిట్టచివరి 'శేఖర'శబ్దసంయోజనము మాత్రము ఈ కృతియొక్క మకుటమునకు శిరశ్శేఖరముగా నమరియున్నది. ఇది యిందలి ప్రత్యేకత. సుదీర్ఘమయ్యు, శ్రవణసుభగమైన శయ్యతో నొప్పుచున్న యీ మకుటము ఈకృతికి అపూర్వరామణీయకమును ప్రసాదించుచున్నది.

iv) ఆద్య సంబోధన:

స్తుతివచనములు ప్రతిదియు సంబోధనతో ఆరంభమగుట యనునది సింహగిరి వచనముల రచయిత పెట్టిన యొరవడి. ఈయన వచనముల మొదట 'దేవా'— అను ఆద్యసంబోధన నియతముగా నుండును. ఇట్లు ఒకే సంబోధ్య వాచకమును ప్రతివచనము మొదట గూర్చెడు పద్ధతిలో ఒకటి రెండు మార్పులను గావించి, ఈ 'యాద్యసంబోధన' సంప్రదాయమును పెంపొందజేసిన కీర్తి తాళ్లపాక పెదతిరుమలాచార్యులది. ఆయన తాను రచించిన 'వేంకటేశ్వర వచనముల'లో ఈ విషయమై కావించిన మార్పు లివి:

అ) ఆద్య సంబోధనలో వైవిధ్యము. అనగా ప్రతివచనమును ప్రత్యేకమగు నొక సంబోధ్య వాచకముతో ప్రారంభించుట.

ఉదా:— వ. 1) శ్రీ వేంకటగిరిదేవా!, వ. 2) నందకాయుధధరా!
వ. 3) అలమేలుమంగపతి!, వ. 4) క్షీరాబ్ధిశయనా!
వ. 5) దామోదరా! —మొదలగునవి.[3]

ఆ) ఆద్యసంబోధన సాభిప్రాయముగా నుండుట. అనగా విశిష్టార్థ సముచితమగు సంబోధనతో నారంభించి, ఆ సంబోధనలో నిమిడియున్న భావమున కనుగుణముగా ఆ వచనమును విస్తరింపజేయుట, ఇందులకు రెండుదాహృతులు:[4]

---

3. చూ: తాళ్ళపాకకవుల లఘుకృతులు (1935), పుటలు 93–95.

4. చూ; అదే, పుటలు 106 & 109.

1) చక్రపాణీ! నీపాదయుగంబు లోనై నేను వ్యసనంబుల బారిం జిక్కినప్పుడు నీ బంటనని విడిపించుకొనుమీ! ........................ వేంకటేశ్వరా! — 26 వ.

2) సీతాపతీ! రాఘవా! మీయాకారంబులు గనుంగొన నెవ్వరివశము?.... .................................................... వేంకటేశ్వరా! — 29 వ.

ప్రకృతగ్రంథకర్తయైన పరవస్తు రామానుజాచార్యులు పెదతిరుమలయ్య ప్రవేశ పెట్టిన పై రెండు మార్పులను — ముఖ్యముగా రెండవ మార్పును తన రచనలో ప్రతివచనమునందును సమర్థవంతముగా పాటించుటలో సఫలీకృతుడయ్యెననుటకు ఇందలి 108 వచనములును అక్షర నిదర్శనములు.

V) విన్యాసము:

యతిరాజశేఖరుడు, ఆచార్యోత్తముడునైన 'ఉడయవరుల' యెడల తనకుగల భక్తిప్రపత్తులను అక్షరరూపమున విన్యసించుటలో ఈ విద్వత్కవియిందు ఉభయవేదాంత సంబంధియగు విశిష్టాద్వైత వాఙ్మయముయొక్క సారమును సందర్భోచితముగా వినియోగించుకొన్నాడు. అట్లు వినియోగించుటలో ఈ కవి వర్యుడనుసరించిన పద్ధతు లివి:

అ) సంస్కృత ద్రావిడభాషలలో వెలసియున్న వేర్వేఱు సంప్రదాయ గ్రంథములయందలి పాశురముల, శ్లోకముల, వాక్యములలో గల విశిష్టార్థములను, భావములను అనువదించి, అత్యంత సహజముగా ఆయావచనములలో నిమిడించుట. నమ్మాళ్వార్లు వచించిన తిరువాయ్మొళి, యామునాచార్యులు రచించిన స్తోత్రరత్నము, తిరువరంగత్తముదనార్ రచించిన ప్రపన్నగాయత్రి, మణవాళ మహా మునుల యతిరాజవింశతి, వేదాచార్య భట్టరుల క్షమాషోడశి, వేదాంతదేశికుల యతిరాజ సప్తతి— మొదలుగాగల సంప్రదాయ గ్రంథములనుండి యీ కవి స్వీకరించిన యిందలి భావము లిందులకు నిదర్శనములు.

ఆ) వివిధగ్రంథములనుండి స్వీకరించిన శ్లోకభాగములు, వాక్యములు, పదబంధములు — మున్నగువానిని ఆయా వచనములలో అవశ్యకమగు పట్టుల సముచితరీతిని సంధానించుట. శ్రీమద్రామాయణము, విష్ణుపురాణము, నాచ్చియార్ తిరుమొళి, గద్యత్రయము, ధ్యానబిందు తైత్తిరీయాద్యుపనిషత్తులు— మున్నగు పెక్కు గ్రంథములనుండి గ్రహింపబడి, యిందు చోటుచేసికొన్న యుల్లేఖనము లెల్ల ఇందులకు ఉదాహరణీయములు.

ప్రతిభావంతుడైన పరవస్తుకవి పై విధమున గ్రహించిన యంశములను స్వకీయ కవనకౌశలముచే చక్కగా సమన్వయించి, ఆయా వచనములలో సందర్భోచితముగా, సహజముగా పొందుపఱచి యున్నాడు.

ఉపమారూపకోత్ప్రేక్షాద్యలంకారభూషితములై, శేషత్వభాష, ప్రపత్తి రసపూరితములై నినదించుచున్న యీ స్తుతివచనములలో శేషనగరాధినాథునకు జయజయధ్వనులు పల్కుచున్న 18 వ వచనము, ఆ యతిరాజశేఖరుని మహాప్రభుత్వమును సాంగోపాంగముగా నిరూపించుచున్న 97 వ వచనము మచ్చునకు తిలకింప దగినవి.

VII) భాష:

ఈ కృతియందలి భాషాస్వరూపము క్రీ. శ. 17 వ శతాబ్దినాటిది; శిష్ట వ్యావహారికము. ఇది ముఖ్యముగా తిరుపతి, తత్పరిసర ప్రాంతములయందు వసించిన శిష్టజనుల వాడుకలో నున్నట్టిది. పరుష (యాత్రికులగుంపు). కసవు (గడ్డి), మణయగాండ్లు (గుళ్ళు మున్నగుచోట్ల పెత్తనము చలాయించు అధికారులు), పారుపత్తెము (అధికారము) పలుగణి (కిటికీ)—వంటి విశేష్యములు, జిగులుకొను (చిక్కుకొను), చెంగిపోవు (తొలగిపోవు), ఈడుపడు (సాటియగు), వెతుకులాడు (అన్వేషించు), ఎడపడు (విడివడియుండు)—వంటి శబ్దపల్లవ క్రియారూపములు, నిన్నుండి ఇదేమి న్ననవు, తిరిగిన్నని—వంటి ద్రుతద్విత్వ సంధిరూపములు, అడియడు (సేవకుడు), చాతించు (అలంకరించు)—వంటి తమిళ భాషాప్రభావిత శబ్దములు మొదలైనవి పెక్కు లిందుంలకు తార్కాణములు.

ఈ కవి గొప్పపండితుడు. భాషావేత్త యగుటవలన ఇందలి వచనములలో అడుగడుగున 'చిరచిత్రప్రకారతయా, వినియుజ్యమానత్వేన'—వంటి సంస్కృత విభక్త్యంతములు, 'అంధ పరంపరాన్యాయము, గోవత్సన్యాయము'—వంటి తర్కశాస్త్ర సంబంధి న్యాయములు, పోకకు పుట్టెడు లభించుట, నోరూరుట, బాసచేసి గెలుచుట, అబద్ధంబులాడి దిద్దుకొనుట, అడబోయిన తీర్థము, కొండమీద పెట్టిన దీపము, చిచ్చల్లుకొన్నగతి, పాముకాటు చందము, మంటిదైన మాయెద్దే గెలువవలె'—మున్నగాగల జాతీయములు, సామెతలు, లోకోక్తులు కోకొల్లలుగా నెలకొని యున్నవై, ఈ కవిశేఖరుని భాషా ప్రయోగ నైపుణ్యమును వేనోళ్ళ వెళ్ళనాడుచున్నవి.

ఇక, వాక్యము లొక్కొక్కచో నించుక దీర్ఘముగా కొనసాగినప్పటికిని ఎచ్చటనైనను అన్వయకాఠిన్యముగాని అర్థక్లిష్టతగాని లేకుండునటుల సుబోధముగా వచన రచనచేయుటలో ఈకవి సిద్ధహస్తుడు. ఇందులకు ఇందుండి యెన్నో యుదాహరణల నెత్తి చూపవచ్చును. మచ్చునకు 67 వ వచనము తిలకింపదగినది.

'దేవరవారు, చేకాయకము, విడుమంటివోటు'—వంటి తేటతెలుగు సమాసములతో 'అహో! లెస్స! మేలుమేలు! భళిభళి! ఔరౌర! పరాకుపరాకు!' వంటి హెచ్చరికలతో 'నాస్వామీ! అనతియ్యవే! నాతండ్రీ! నన్నుఁ గన్నవాఁడా! నిన్నుఁబోలిన తత్త్వదర్శి కలరటే!'-వంటి ఆప్యాయత యుట్టిపడుచున్న పిలుపులతో విలసిల్లెడి యీ స్తుతివచనములు ఒక్కమాటలో క్రీ. శ. 17 వ శతాబ్దియందలి శిష్టభాషాస్వరూప స్వభావముల అవగాహనకు మేలైన యునికిపట్టులు.

## VII) శైలి:

రచనాశీలమే శైలి. ఇది అ) శబ్దగతము ఆ) అర్థగతము— అని ప్రధానముగ ద్వివిధము. ఇందు మొదటిది శబ్దముల కూర్పునకు సంబంధించినది. రెండవది ప్రతిపాదిత విషయమునకు సంబంధించినది.

ఇది వచన కృతిగనుక, ఇందలి శబ్దగతమగు శైలిని 1) వృత్తగంధి 2) చూర్ణము 3) ఉత్కలికాప్రాయము— అని ముత్తెఱగుల విభజింపదగును. అట్లే అర్థగతమగు శైలిని 1) కథనాత్మకము. 2) వర్ణనాత్మకము 3) నాటకీయము అని త్రివిధముగా వింగడింపవచ్చును.

పెక్కు సంస్కృత శ్లోకముల, వృత్తముల భాగము లిందులోని కనూదితములై ఇమిడియుండుటచే వృత్తగంధిశైలీలక్షణ మీ వచనములలో స్పష్టముగా గోచరించుచున్నది. ఇందులకు ఉదా:- 1, 18 వచనములు. ఇందలి వచనములు స్వాభావికముగా చూర్ణపదములే యగుటచే విడివిడిగ; పొడిపొడిగ నుండెడు లలిత పదముల కూర్పు వీనిలో నెక్కడ బట్టినను సాక్షాత్కరించు చుండును. ఉదా:—48, 108 వచనములు. ఇక, ఉత్కలికాప్రాయమైన (సమాస విన్యాసముగల) శైలికి ఇందలి 55, 59 వచనములు పరికింపదగినవి.

ఇందలి కథనాత్మక శైలికి 7 వ వచనము, వర్ణనాత్మక శైలికి 42, 97 సంఖ్యల వచనములు నాటకీయ శైలికి 99 వ వచనము మచ్చుకు పరిశీలింపదగి యున్నవి. అర్థగతములైన త్రివిధశైలులలో నాటకీయ శైలియే ఈ రచనయందుం

విశేషముగ ప్రాచుర్యము వహించియున్నది. ఇందలి ప్రతివచనము ఈ కవి తన యిష్టదైవమైన యతిరాజశేఖరునితో అడుగడుగున సంభాషించుచున్న అనుభూతితో గూడియే జాల్వారినది.

అది శబ్దగతమైనను అర్థగతమైనను ప్రతిరచనయొక్క శైలిలోను ప్రతిభాశాలియగు రచయితయొక్క వైయక్తికలక్షణమునకు సంబంధించిన ప్రత్యేక ముద్ర స్పష్టముగా గోచరించుచుండును.

మధురకవితాశ్రేణికి చెందిన యీ స్తుతి వచన రచనను తెలుగులో వెలయించిన ఇల్లిందల పరవస్తు రామానుజాచార్యకవి ప్రతిభాశాలురైన యట్టి కవీశ్వరులలో అగ్రేసరుడు.

viii) చారిత్రక, సాంఘికాంశములు:

ప్రధానముగా స్తుతివచనరూపమైన యీ లఘుకృతిలో సందర్భోచితముగా కవికాలమునాటి చారిత్రక, సాంఘిక విషయములు కొన్ని చోటుచేసికొన్నవి. అవి యీక్రింద సంగ్రహీకరింపబడుచున్నవి:

1) ఈకృతినాయకుడైన 'యతిరాజశేఖరుడు' తెటు (శేషనగరము) నందలి వేణుగోపాలస్వామివారి[5] యాలయమున ఈ కవితండ్రియగు ఇల్లిందల వేంకటాచార్యులచే ప్రతిష్ఠితుడు.[6]

---

5. ఈ వేణుగోపాలస్వామి అక్రూరునిచే ప్రతిష్ఠింపబడినట్లును, ఈ వేణుగోపాలు నకు సంతానవేణుగోపాలుడను పేరు కలదనియు, ఆ గ్రామమునకు 'శేషనగర' మను నామాంతరమున్నటులును ఆ యూరి పెద్దలైన మ.రా.రా.శ్రీ కామకోటి వాసుదేవరావుగారు తెల్పిరి. వారే 'తెట్టు'నుగూర్చిన యీ క్రింది పద్యమును తెల్పియున్నారు:

ఉ॥ శారదనీరదప్రతిమసౌధవరంబుల భక్తశేఖరా
క్రూరప్రతిష్ఠితుండయిన గోపవధూపతి వీక్షణంబులన్
శారద మించి భూరితరసంపద నింపు వహింప, యింపు లే
పార ధరాంగనామణికి పాపటబొట్టుగ తెట్టు శోభిలున్.

— గుమ్మరాజు రామకవి ప్రణీతము.

6. '........ నేడిట్లర్చారూపంబున నిల్లిందుల వేంకటాచార్యుల కిష్టదైవంబవై నిలిచి......................................................' (91 వ.)

2) తిరువాణూరులో తెలిసియున్న అమ్మవారిపేరు అలమేలుమంగ.[7]

3) వేంకటేశ్వరుడు అర్చకముఖమున స్వకీయాభిప్రాయములను వెల్లడించుచుండుట కలదు.[8]

4) తిరుపతియందలి ఆలయములలో 'మణియగాండ్లు' పరులకు బాధాకరముగా ప్రవర్తించుచుండువారు.[9]

5) ఆ కాలములో తిరుపతిప్రాంతమున దేవతావిగ్రహ నిర్మాణములు, ప్రతిష్ఠలు కొనసాగుచుండినవి.[10]

ix) వైశిష్ట్యము:

శ్రీమద్రామానుజుల అవతారస్థలమైన శ్రీపెరుంబుదూరులో ఆయన అర్చామూర్తికి 'తిరుమంజనము' జరుపు వేళలందు, ఉత్సవసందర్భములలో ఊరేగింపు ముగిసిన పిమ్మటను 'కట్టియము' అను పేరుగల స్తోత్రపాఠములను చదివెడు ప్రాచీన సంప్రదాయము ఈనాటికిని పాటింపబడుచున్నది. 'కట్టియం'—అను ద్రావిడపదమునకు 'పలురీతుల ఉగ్గడించుచు స్తుతించు రచన'—యని అర్థము. పరిశీలింపగా నిది సంస్కృతమందలి 'గద్యమ్' — అను పదమునకు తద్భవముగా తోచును. కట్టియములను చదువుటకు నియుక్తులైనవారు వాటిని ప్రత్యేకమగు బాణీలో రాగయుక్తముగా పఠించుచుందురు.

ప్రకృత 'యతిరాజశేఖరవచనములు' సైతము శేషనగరాధినాథుడయిన రామానుజుని సమక్షములో సమర్పించుచున్న 'కట్టియము' లనెడి ఉత్తమ సంకల్పముతో ఈ కవీంద్రుడు వీటిని రచించెనని దృఢముగా విశ్వసింపవచ్చును. ఈ కవిహృదయమును గుర్తించినందుననే కాబోలు, అనంతరకాలీను లెవ్వరో వీటికి రాగనిర్దేశమొనర్చియున్నారు. ఈకృతియొక్క వ్రాతప్రతులలో నొకదాని యందు[11] ఇందలి వచనములలో కొన్నింటికి దిగువ పేర్కొన్న విధముగ రాగ నిర్దేశము కానబడుచున్నది:

---

7—10 చూ: 100 వ వచనము.

11. చూ: 'యతీంద్రస్తోత్రము' No 10 (c) (Palmleaf) యస్. వి. యు. ఓ. రీసర్చి ఇన్స్టిట్యూట్ గ్రంథాలయము, తిరుపతి.

| వచనసంఖ్య | — రాగము | వచనసంఖ్య | — | రాగము |
|---|---|---|---|---|
| 1 | — భూపాలం | 104 | — | సౌరాష్ట్రి |
| 101 | — భైరవి | 105 | — | కేదారగౌళ |
| 102 | — శంకరాభరణం | 106 | — | కన్నడగౌళ[12] |
| 103 | — రేగుప్తి | | | |

మీద పేర్కొనిన వ్రాతప్రతిలో 2 నుండి 100 వరకుగల 99 వచనములకు రాగ నిర్దేశము లేదు. ఇందువలన వీటినన్నింటిని ఒకటవ కీర్తనకు నిర్దేశించియున్న భూపాలరాగముననే పఠింపవలయునని లేఖకుని యభిప్రాయముగా భావింపదగును.

పై రీతిని స్తుతివచనములకు రాగనిర్దేశము గావించుటలో తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల 'వైరాగ్య వచనమాలికాగీతముల' (వేంకటేశ్వరవచనముల) ప్రభావముకూడ కొంతవరకు కారణమై యుండును.[13]

మొత్తముమీద తెలుగున రామానుజస్తుతి పరములుగా వెలసిన రచనలలో అన్నివిధముల మేలుబంతియై, ఈ 'రామానుజామృతము' స్తుతివచనకృతి సముదాయమున మధ్య మణి న్యాయమున ప్రకాశించుచు, 'శఠకోపవిన్నపముల'వంటి అనంతరరచనలకు ఆదర్శమై — స్వసిద్ధాంతాభినివేశప్రేరితమగు అన్యమత తిరస్కృతి యొకటి రెండు పట్టులలో చోటుచేసికొనియున్నప్పటికిని — భాషా పరిణామ వికాసపరిశీలనమున కత్యంతోపయుక్తమగు అమూల్య రచనగా అలరుచున్నది.

## 3 రచయిత

ఈ గ్రంథరచయిత ఇల్లిందల వరవస్తు రామానుజాచార్యులను పేరుగల విద్వత్కవి. ఈయన కాలము ఈకృతి యందలి నూఱవ వచనమునుబట్టి నిర్ణయింప వీలగుచున్నది.

i) కాలము:

నూఱవ వచనములో నితడు శేషనగరము (తెట్టు) నందలి వేణుగోపాల స్వామివారి యాలయమునగల గోదాదేవీ విగ్రహమును తొలుత తిరుచానూరులో

---

12 చూ: అదే., ఈప్రతిలో గ్రంథము 106 వ వచనముయొక్క ప్రారంభము వరకే కలదు.

13 చూ: తాళ్ళపాక కవుల లఘుకృతులు (1935) పుటలు 93-118.

ప్రతిష్ఠించిన వైనమును, ఆ ప్రతిష్ఠాకాలమును దిగువపంక్తులలో స్పష్టముగా పేర్కొనియున్నాడు:

"... ...........'అచ్చుట గోదాసంజ్ఞికవ్యూహలక్ష్మీ విగ్రహంబునుం బ్రతిష్ఠచేయించి యీ శేషనగరంబునకుఁదెచ్చ్మని దేవరవారు దాసునకు నియమింపంగాఁ దత్ప్రకారంబునం దిరుపతియందు విగ్రహనిర్మాణంబు చేయించి తిరుచానూర నలమేలుమంగా సన్నిధానంబునఁ బ్రతిష్ఠచేయుటకై తిరుమలయం దర్చకముఖంబున సన్నిధి ననుగ్రహంబునుం బడసిన శాలివాహన శకవర్షంబులు వేయున్నాఱునూట పదునాలుగవదియగు ప్రజోత్పత్తి సంవత్సర ఫాల్గుణ శుద్ధ యేకాదశీ గురువారంబుతోఁ గూడిన పునర్వసు నక్షత్రమందు మీనలగ్నంబున నావాహనంబు గావింపఁజేసి విజయంబుచేయించుకొని వచ్చినప్పుడు........."

పై వచనపంక్తులలో దెల్పిన విగ్రహప్రతిష్ఠాకాలము క్రీ. శ. 1692 ఫిబ్రవరినెల 18 వ తేదీ గురువారమునకు సరియగుచున్నది. కావున, పై ప్రతిష్ఠ కావింపబడిన తరువాతనే ఈ గ్రంథము రచింపబడినదను విషయము వెల్లడియగుచున్నది.14 దీనినిబట్టి యీ కవి క్రీ. శ. 17—18 శతాబ్దుల నడిమికాలమున జీవించియుండెనని సుకరముగా నిర్ణయింప వచ్చును.

## ii) వంశము:

ఈ కవీశ్వరుడు గార్గ్యగోత్రజుడు, పరవస్తు వంశీయుడు, తెంగలై శాఖీయుడునైన శ్రీ వైష్ణవపండితుడు. ఈ 'పరవస్తు'వంశము తపశ్శక్తి సంపన్నులగు స్వయమాచార్య పురుషులకు నెలవైన విద్వద్వంశముగా తిరుపతి క్షేత్రమున క్రీ.శ. 16 వ శతాబ్ది ప్రారంభకాలమునకే ప్రశస్తి గడించియుండినది. ఈవంశమునకు మూలపురుషుడు(కూటస్థుడు) 'పెరియ అణ్ణన్'. ఈ పండితవర్యుడు క్రీ.శ. 16 వ శతాబ్ది ప్రారంభమున స్వస్థలమగు యాదవాద్రి (మేల్కోట) ప్రాంతమునుండి బయలుదేరి తిరుపతి చేరుకొనెను. ఈయన కావించిన సేవకు సంతోషించి

14. See: An Indian Ephemeris, vol vi (1922), Swamikannu-Pillai, Page 186.

శ్రీవేంకటేశ్వరు డీయనను "పరవస్తు!" అని సంబోధించెనట![16] ఆనాటినుండి ఆ వంశీయులు 'పరవస్తువారు'గా వ్యవహరింపబడిరి. ఈ యంశము "శ్రీవచన భూషణము—ఆంధ్రవ్యాఖ్యానము"— అను గ్రంథముయొక్క భూమికలో ఈ క్రిందివిధముగా వివరింపబడియున్నది.[17]

"............... అప్పుడు అర్చకులు శ్రీ అణ్ణన్‌స్వామివారి ఆజ్ఞాను సారము శ్రీ నమ్మాళ్వారుల ఉత్సవమును జరిపించిరి. ఆ సందర్భమున అచ్చట వేంచేసియున్న శ్రీ వైష్ణవులు వీరిని తిరుమలకు తోడ్కొని చనిరి. వీరు శ్రీనివాసు లను మంగళాశాసన పూర్వకముగా సేవించగా తిరువేంగడముడైయాన్ పెరియ పెరుమాళ్ అను తమ ప్రధానార్చకులను ఆవేశించి 'మీరు పరవస్తు'— అని శ్రీ అణ్ణన్‌ను సంబోధించిరి. నాటినుండి వీరికిని, వీరి వంశజులకును "పరవస్తు" అని పౌరుష నామము వచ్చినది..............."

పై పంక్తులలో నుల్లేఖింపబడిన పరవస్తు అణ్ణన్‌గారి కుమారుడు 'నైనారు'. ఈ పరవస్తు నైనారుగారి మహానుభావత ఈ కృతియందు 7 వ వచన మున వర్ణింపబడినది. తిరుపతిలో భగవత్కైంకర్యపరులుగా నుండిన పరవస్తు నయనారు తనకడకువచ్చి యాశ్రయించిన యిరువురు క్షత్రియులకు 'చీటీ' వ్రాసి యీయగా వారు తిరునారాయణపురమున (మేల్కోట) కేగి, అచ్చట వెలసియున్న

---

16. 'పరవస్తు" — అనగా పరుని (భగవంతుని) యొక్క వస్తువు (శ్రేష్ఠమైన వస్తువు).
    విశిష్టాద్వైత సిద్ధాంతాను సారముగ i) చిత్తు (చేతనుడు or జీవాత్మ), ii) అచిత్తు (ప్రకృతి), iii) ఈశ్వరుడు (భగవంతుడు)- అని తత్త్వములు మూడు. వీటిలో మొదటిరెండు తత్త్వములు మూడవ తత్త్వమగు భగవంతు నకు 'శేషములు' (స్వాధీనములు or పరతంత్రములు).
    శ్రీమన్నారాయణునకు తాను 'శేష'మైనవాడననెడు నిశ్చల భావముతో నిత్య మును ప్రపత్తితో భగవానుని సేవించువాడే నిజముగా 'పరవస్తువు' అణ్ణన్ స్వామి అట్టివారుగావుననే సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరస్వామియే ఆయనను 'పరవస్తూ!' అని ఆప్యాయతతో సంబోధించి యుండెనని గ్రహింపదగును.
17. చూ: శ్రీవచన భూషణము— ఆంధ్ర వ్యాఖ్యానము (1970)- శ్రీమత్పరవస్తు గోవిందాచార్యస్వామివారు, దేవాడ (విశాఖపట్టణంజిల్లా), భూమిక, పుట 21.

సంపత్కుమారస్వామి (చెల్వపిళ్ళ) వారికి ఆచీటీని సమర్పించు కొనిరట। వారట్లు తెచ్చియిచ్చిన యా చీటీని ఆస్వామి తన 'రాజముడిలోంగూర్చి శిరసావహించి, వారికిని, వారికైన బంధువులకు మున్నూటికింగూడ పరమపదం బిచ్చెనట।'

మఱియు ఈ నయనారు శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున విలసిల్లిన అష్టదిగ్గజకవులలో నొకడై యుండిన అయ్యలరాజు రామభద్రకవికి 'పరమగురువు'గా విరాజిల్లెనను అంశము పరిశీలనలో వెల్లడైనది:

"కం. పరవస్తువంశరత్నా-కరకౌస్తుభ సుప్రభావఖని నయనారుం
బరమగురుం దలంతు; ముమ్మడి-వరదాచార్యాంఘ్రివనజవందారుండనై"[18]

—రామాభ్యుదయము; అవతారిక.

iii) ఇంటిపేరు:

మీద నుదాహరించిన 'పరవస్తు'— అనెడు వంశనామముతోపాటు, 'ఇల్లిందుల (ఇల్లిందల)' — అను గ్రామనామముకూడ ఈ గ్రంథకర్తయైన రామానుజాచార్యుల యింటిపేరుగా జతపడియున్నది.[19] ఈ గ్రామనామమునకు సన్నిహిత శబ్దసారూప్యముగల ఊళ్ళపేర్లు ఆంధ్రదేశమున ప్రధానముగా రెండు కానిపించుచున్నవి.[20]

---

18. చూ: i) రామాభ్యుదయము, తాళపత్రప్రతి No. 1262 (c), పత్రసంఖ్య గలాతి బి.,
ii) ,, ,, కాగితపుప్రతి No 6802, పుట 2.
(యస్. వి. యు. ఓరియంటల్ రీసర్చి ఇన్స్టిట్యూట్ గ్రంథాలయము, తిరుపతి).
[Note:- వావిళ్ళవారు ప్రచురించిన ముద్రితప్రతిలో పై కందపద్యము(11ప.) అనన్వితముగా, అపపాఠయుతముగా నున్నందున, వ్రాతప్రతులనుండి యుద్ధరించి చూపబడినది.]

19. i) '..........నేఁడిట్లర్చారూపంబున నిల్లిందుల వేంకటాచార్యుల కిష్టదైవంబవై నిలిచి.................' — (91 వ వచనము),
ii) '..........ఇల్లిందుల వేంకటాచార్యుల రూపంబున, వచ్చి.........' —(92 వ వచనము)

20. See: District Census Handbook, Khammam District (1968',
Pages A 87, A 98—A 99, D 23 & D 101.
(Pubished by the govt. of Andhra pradesh, Hyderabad).

1) ఇల్లెందులపాడు—ఇది ఖమ్మంజిల్లా మధిర తాలూకాలో మధిరకు సమీపమున నున్న చిన్నగ్రామము.

2) ఎల్లందు (ఇల్లందు) — 'ఎల్లందల్లపాడు' — అనునది దీని పూర్వ నామధేయము. ఇదియు ఖమ్మంజిల్లాలోనిదే. 'ఎల్లందు తాలూకా'కు కేంద్రము.

తిరుపతి వాస్తవ్యులైయుండిన ఈ రచయిత పూర్వులు రాజాదరణము, స్వశిష్యుల అభ్యర్థనమువంటి కారణాంతరములచే ఆ యా ప్రాంతములకు తరలిపోయి స్థిరపడినందుననే, వారికి 'ఇల్లిందల'యను గ్రామనామ మింటిపేరుగా నెలకొనెనని నిశ్చయింపదగును.

iv) ఇతర రచనలు:

ఇల్లిందల రామానుజార్యకవి యితను మఱికొన్ని కృతులు రచించియున్నట్లు ఈ క్రింది పంక్తులనుబట్టి తెలియుచున్నది:

"..........నీవిషయంబుగా నాంధ్ర గీర్వాణ ద్రావిడ కర్ణాటాది భాషామయంబులైన గద్య పద్య సంకీర్తనాత్మకానేకకృతులు చెప్పనాడుటకు బుద్ధి యిచ్చి, వాచకంబును నీకే శేషంబు చేసికొంటివి..................." (105 వ వచనము).

కాని, రచయిత తాను రచించిన ఆ 'అనేకకృతు'లేవో యిందు పేర్కొనలేదు.

'యతిరాజశేఖరా!'—అను మకుటముతో చంపకోత్పలములలో రచింపబడిన 'యతిరాజశేఖర శతకము' తాళపత్రప్రతి యొకటి హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయమున నున్నది. సంఖ్య T 320. అందలి,మకుటము, ఆద్య సంబోధనలు, శైలి— ఈ యంశములలో గోచరించుచున్న సామ్యమును బట్టి ఆ శతక మీకవి రచించినదేయని నిశ్చయింపదగియున్నది.

మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమువారు ప్రచురించిన "రామానుజ చంపూ"—అనెడి సంస్కృత కావ్యముయొక్క ఉపోద్ఘాతములో గర్గగోత్రజుడైన యొక రామానుజాచార్య కవి ప్రస్తావింపబడియున్నాడు:21

"...... Ramanujadasa the author of the commentaries on Atimanusastava (Sri Rangarajastava), Varadarajastava, Sristava, Sundarabahustave and Srigunaratnako'sa is also called Ramanujacarya and pays obeisance to his teacher Venkata.

21: See: 'Sri Ramanujacampu,' Introduction Page v, Madras Governament Oriental Manuscript Series No. 6 (1942)

But he is different from our author as he belonged to garg gotra (See colophon of D 10, 269) ..................."

గర్గగోత్రజుడు, వేంకటార్యుని శిష్యుడునైన రామానుజాచార్యుడు మానుషస్తవాది పంచస్తవములకు వ్యాఖ్యానములను రచించి యున్నటుల పై నుట్టంకించిన యాంగ్ల వాక్యములనుబట్టి తెలియుచున్నది. ప్రకృత గ్రంథకర్తయు ఇల్లిందల రామానుజాచార్యుడును 'గార్గ్యవేంకటాచార్య శ్రీపాదకమలాశ్రయుడై' యుండుటచే ఈ యిరువురు రామానుజాచార్యులును అభిన్నులని తలంచుట కవకాశమేర్పడుచున్నది. ఇతోధిక పరిశీలనమున ఈ విద్వత్కవి రచించిన యి కృతులింకను కొన్ని బయల్పడగలవని విశ్వసింపవచ్చును.

V) వైదుష్యము:

పైనుదాహరించిన 105 వ వచనమందలి పంక్తులనుబట్టి యీ ఆంధ్ర గీర్వాణ ద్రావిడ కర్ణాటాది భాషలు బాగుగా నెఱిగిన పండితుడని ఆ భాషలలో గద్య, పద్య, సంకీర్తనములనెడు త్రివిధ రచనా ప్రక్రియలలో కృతి రచించు నైపుణ్యముగల్గిన కవీశ్వరుడని స్పష్టమగుచున్నది, కాని, ఈ కవిరచిం ఆ వివిధ రచనలు మన కీనాడలభ్యములైనవి. ఐనను, ప్రస్తుత రచనయ 'రామానుజామృత' మొక్కటే ఈయన ఆ కాలములో ఎన్నదగిన విద్వత్క శేఖరుడుగా విలసిల్లెననుటకు అక్షర నిదర్శనముగా నిలిచియున్నది.

అనేక పురాణగాథా ప్రస్తావములతో, తర్కశాస్త్ర సంబంధి న్యాయ లతో, వేదాంతోక్తులతో, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదన పాటవముతో, అర్థవ ములగు సూక్తులతో, సంవాదాత్మక శైలిలో చతురముగా, శ్రవణపేయమ సాగిన యీకృతియందు 'కొండ అద్దమందు కొంచమైయుండదా?' అన్నసామె ఈ విద్వత్కవి యాకళించుకొన్న జ్ఞానవిజ్ఞానముల సారమంతయు చక్కగా ఫలించి యున్నది.

## 4 పరిష్కరణ

ఈ గ్రంథ పరిష్కరణమున ఉపయోగింపబడిన వ్రాతప్రతులు మూ వాటి స్వరూప వివరణ మీ దిగువ నీయబడుచున్నది.

---

22. చూ: అవతారిక, 2 వ శ్లోకము.

i) ప్రతులవివరణము:

1) 7726 (Palm leaf) సమగ్రము. ఇది శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనసంస్థ (తిరుపతి) యందలి ప్రతి. కొలతలు: 36.5 సెం. మీ. × 3.5 సెం. మీ., 40 పత్రములు (80 పుటలు) గలవు. పుటకు 7 పంక్తులు, పంక్తికి 70 అక్షరములున్నవి. గుండ్రనివ్రాత. అచ్చటచ్చట కొన్ని యాకులు క్రిమిదష్టము లైనను, రచనాస్వరూప సమగ్రావగాహనకు ఇబ్బందిలేదు. 'రామానుజ విన్నపము' అని యిందలి శీర్షిక. కాంచీపుర వాస్తవ్యులైన భాష్యకారాచార్యులనువారినుండి క్రీ. శ. 1956 కు పూర్వము ఈ సంస్థచే కొనబడిన ప్రతి యిది.

2) R 503 (Paper) ఇదియు ఈ పరిశోధనసంస్థగ్రంథాలయములోనిదే. కొలతలు: 27 సెం. మీ. × 24 సెం. మీ., 76 పుటలు, పుటకు 20 పఙ్క్తులు, పంక్తికి 24 అక్షరములు గలవు. లేఖక దోషములున్నవి. ప్రతి బాగున్నది. ఇందు 108 వచనములు పూర్తిగా నున్నను వీని క్రమము ఒకటి రెండు చోట్ల ముందు వెనుకలై యున్నది. అవతారికలోని 'శ్రీ గార్గ్య వేంకటాచార్య శ్రీ పాద కమలా శ్రయమ్'– ఇత్యాది 7 వ శ్లోకము మాత్రము కలదు. ఆశ్వాసాంతగద్య లేదు. ఇది గూటాల (పశ్చిమగోదావరిజిల్లా) వాస్తవ్యులైన ప్రతివాది భయంకర అణ్ణన్ వెంకటరాఘవాచార్యులుగారియొద్ద నుండిన ప్రతి ననుసరించి క్రీ. శ. 1918 ఆగస్టుకు ముందు వ్రాయబడినది. 'యతిరాజశేఖర వచనము' అనునది యిందలి శీర్షిక.

3) T 524 (Palm leaf) ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయము (హైదరాబాదు) నందలి ప్రతి. 59 పత్రములున్నవి. వ్రాతయొక మోస్తరు. ప్రతిలో శైథిల్యము గోచరించు చున్నది. ఆకులు తార్మారైయున్నవి. వచనముల వరుసక్రమము ముందు వెనుకలుగా నుండుట, పునర్లేఖనములు, వ్రాతలో కొట్టి వేతలు, లేఖనదోషములు కలవు. ఈ ప్రతిలో అవతారికయందలి తొలియైదు శ్లోకములు గలవు. 80 వ వచనము లేదు. 97, 98 వచనముల భాగము లొకటిగా కలిపి వ్రాయబడినవి. ఈ కారణముచే నిందు 106 వచనములే యుండుట తటస్థించి నది. ఆశ్వాసాంత గద్యలేదు. 'రామానుజవిన్నపము'అని దీని శీర్షిక. ఈప్రతిలో లభించిన పాఠాంతరములకు '(ఉ)'– అను సంకేతముంచబడినది.

ii) పాటించిన పద్ధతులు:

అ) తొలుదొల్త ఈ పరిశోధనసంస్థయందుగల రెండు వ్రాతప్రతులను

తులనాత్మకముగా పరిశీలించి, అందు మేల్తరముగా నున్న 7726 సంఖ్య గల తాళపత్రప్రతిని ప్రధానప్రతిగా నెన్నుకొని, దానిని యథాతథముగా 'కాపీ' చేయుట జరిగినది.

ఆ) అనంతరము వలపలగిలక, దీర్ఘముపై సాధ్యపూర్ణబిందువు, నిండు సున్నకు తరువాతి హల్లు ద్విత్వమైయుండుట—వంటి ప్రాచీన తాళపత్ర లేఖన సంప్రదాయములు, లేఖకుని భ్రాంతి, ఏమఱుపాటు, అజ్ఞత మొదలగు కారణముల వలన ఎడనెడ దొరలియున్న వేరేఱు తీరుల వ్రాతతప్పులు నిర్దుష్టముగా సవరింప బడినవి. ఈకవి ప్రయోగించిన భాష అటు కేవల గ్రాంథికమును, ఇటు కేవల వ్యావహారికమును గాక, ఆరెండిటి సమన్వయస్వరూపమై యుండుటచే, ఇందలి అభివ్యక్తికి (Expression) అనుగుణముగా అరసున్నలు, శకటరేఫములు, ఆవశ్యకమైన సంధులు మున్నగు నంశములతోడి లక్షణానుసరణము మిగుల మెలకువతో నిందు పాటింపబడినది.

ఇ) అటుపిమ్మట R 503 (paper) ప్రతినుండి సముచితములగు పాఠాంతరములను స్వీకరించి, ఆయా వచనముల పుటల యడుగు భాగమున అంకెలతో గుర్తించి నమోదుచేయుట జరిగినది. పాఠాంతరములను స్వీకరించుటకు సంబంధించి యిచ్చుట ఒకటి రెండుదాహరణము లీయదగియున్నవి:

| ప్రధానప్రతియందలి పాఠము | R 503 (P) ప్రతియందలి పాఠము |
|---|---|
| 21 వ వచనము — మంత్రరత్నం | మిత్రరత్నం |
| 65 వ వచనము — శిష్యుల కుపన్యాసంబు | శిష్యులకు సన్యాసంబు |

మీద నుదాహరించిన పాఠములలో R 503 (P) ప్రతియందలివి అర్థవంతము లైనను, అవి కేవలము వ్రాయసకాని అజ్ఞతవలన నావిర్భవించినటువంటివని స్పష్టముగా తెలియుచున్నందున, అట్టి 'అపపాఠములను' ఇందు పాఠాంతరములుగా స్వీకరింపలేదు. మూడవదైన ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయమందలి T. 524 (P. L ) ప్రతినుండి పాఠాంతరములను గైకొనుటలోను ఈ పద్ధతియే అనుసరింపబడినది. తేడా తెలియుటకొఱకు ఈ ప్రతినుండి స్వీకరించిన పాఠభేదముల మొదట '(ఉ)' అను గుర్తు కూర్పబడియుండుట గమనింపగలరు. పుటల యడుగున నీయబడిన యీ పాఠభేదములలో కొన్నింటి చివర చిన్న అడ్డగీత (hyphen) కనిపించును. ఈయడ్డుగీత సమాసగతమైన లేదా వాక్యగతమైన అతర్వాతి భాగము ఉభయప్రతులలోను అభిన్నముగా, ఏకరూపముగా నున్నదను టకు సంసూచకము.

ఈ) వ్రాతప్రతులలో సాధారణముగా నిలువు గీతయే విరామ చిహ్నము. ఈ పరిష్కరణలో సందర్భానుసారముగా కమా, కోలను, తలక్రింది కామాలు, అడ్డుగీత, సంబోధనార్థక, ప్రశ్నార్థకములు — మొదలైన విరామచిహ్నములు సముచితముగా నెలకొల్పబడియున్నవి.

iii) అధోజ్ఞాపికలు:

ఈ కృతిలో ఎన్నో సంస్కృత శ్లోకభాగములు, ద్రావిడోక్తులు, భావములు మొదలైనవి యుట్టంకింపబడియున్నవి. వాటికి సంబంధించిన మూల గ్రంథ సూచనలను (References), సమగ్ర శ్లోకములను, వివరణములను స్పష్టార్థప్రతీతికై ఆవశ్యకములైన చోట్ల ఆయా పుటల యడుగున సమకూర్చుట సంభవించినది. ఈయధోజ్ఞాపికలకు, పాఠాంతరములకు తేడా తెలియు నిమిత్తము వీటి మొదట * + అను గుర్తులుంచబడినవి.

iv) ఇతర ప్రతులు:

ఈగ్రంథమిట్లు పరిష్కృతమై, దీవిముద్రణ పూర్తికావచ్చుచుండిన దశలో ఇటీవల మఱిరెండు ప్రతులు లభించినవి. ఆరెండు ప్రతులలో నొకటి యీ ప్రాచ్య పరిశోధన సంస్థ (తిరుపతి) యందలిదే. ఈ సంస్థ గ్రంథాలయమున గల వ్రాతప్రతులలో No 10 (Falm leaf) అను సంఖ్యతో గూడిన కట్ట (Bundle) యొకటి. ఈకట్టలో A- పరమయోగి విలాసము, B— తత్త్వార్థదర్పణము, C-యతీంద్రస్తోత్రము—అను మూడు గ్రంథములు గలవు. వీటిలో చివరిదైన 'యతీంద్రస్తోత్రము' 'రామానుజ విన్నపములే'గాని వేఱు కాదని యిటీవలి పరిశీలన మున వెల్లడైనది. ఇది యసమగ్రముగా నున్నందున 'వ్రాతప్రతుల అకారాది పట్టిక'ను కూర్చినవారికి దీని రచయిత నామమును పేర్కొనుట కవకాశములేక పోయినది.23 ఇందు 33 తాళపత్రము లున్నవి. ఇవి కుడివైపున కొంతమేర శిథిలమైనవి. శైథిల్యము నటుంచి, ఇందవతారికలోని తొలి యైదు శ్లోకములు గలవు; 105 వచనములున్నవి. ఇంతకుమునుపు రచనా వైశిష్ట్యములో పేర్కొని నట్లు రాగనిర్దేశముతో గూడిన వచనములు గల వ్రాతప్రతి యిదియే। ఈ కట్టలోగల పరమయోగివిలాసము ('O A) చివరి లేఖన కాలము (శార్వరి పుష్యశుద్ధ ౨ లు శనివారము) ను బట్టి,24 యీ ప్రతి క్రీ. శ. 1840 డిసెంబరు 26 వ తేదీకి

23 See: An Alpliabetical Index of Sanskrit, Telugu & Tamil Manusripts, S V. O. R Institute, Publisted by T. T. D., Tiupati (1956),

24. See: An Indian Ephemeris, Vol vii (1987) Page 83.

తరువాత— అనగా 1840—'41 సంవత్సరముల నడిమి కాలములో వ్రాయబడి యున్నట్లు తెలియుచున్నది. ఈ ప్రతిలో లభించిన పాఠభేదములు ఈ పీఠికకు తరువాత ప్రత్యేకముగా నీయబడియున్నవి.

ఇతరప్రతులలో రెండవది 1949 లో ముద్రితమైన ప్రతి.[25] ఈ ప్రతిలో అచ్చుతప్పులు, అపపాఠములు మెండుగా నున్నవి. ఈ గ్రంథారంభమున క్రింది శ్లోక మొక్కటి మాత్రము కలదు:

"గార్గేయ వేంకటాచార్య పాదపంకేరుహాశ్రయమ్।
జ్ఞానవైరాగ్య సంపన్నం రామానుజగురుం భజే॥"

44 నుండి 49 వరకుగల ఆఱు వచనము లీప్రతిలో లేవు. ఆశ్వాసాంత గద్యమైన పిదప గ్రంథాంతమున ఈ క్రిందిపద్యమున్నది:

శా॥ శ్రీరామానుజవిన్నపాలు సరసుల్ చెన్నొందఁగా నిత్యమున్
సారాచారముగా వివేకమతిగా సంపూర్ణసద్భక్తిగా
నోరూరన్ రుచిగాఁ బఠించినను నన్యోన్య ప్రవృద్ధంబు; గం
భీరస్వాంతుఁ డనంత సంపదలచేఁ బెంపొందు నిద్ధారుణిన్.

ఇందు లభించిన పాఠభేదములను పీఠికకు పిమ్మట ప్రత్యేకముగా నియ్యబడినవి.

V) అనుబంధము:

ఈ గ్రంథమునకు చివర నొక 'అనుబంధము' చేర్పబడియున్నది. అందు 'శ్రీభాష్యకారోత్తమా!' అను మకుటముతో 'నవరత్న విన్నపములు' అను పేర తొమ్మిది వచనములు, అనంతరము 'యతిరాజశేఖరా!' అనెడు మకుటము తోడనే మఱియొక వచనము—మొత్తము పది స్తుతివచనములు గలవు. వీటి రచయిత యెవరో తెలియకున్నను, ఇవియు శ్రీరామానుజస్తుత్యాత్మకములే యగుటచేతను, అన్నివిధముల 'యతిరాజశేఖరవచనములను' పోలియుండుటచేతను ఈ గ్రంథాంతమున అనుబంధింపబడి యున్నవి.[26]

---

25. ఇది 1/8 డెమ్మీసైజున 'రామానుజ విన్నపములు' అనుపేర 51 పుటలుగా ముద్రితమైనది. ద్రవ్యసహాయకులు: శ్రీ నడిముక్కల సుబ్బారాయుడు; గ్రంథప్రోత్సాహకులు: శ్రీ గార్లపాటి కనకానందరావు; శ్రీ సత్యనారాయణ; ప్రింటింగ్ వర్క్సు- విజయవాడ (1949).
26. ఈ పదివచనములు ఈ ప్రాచ్యపరిశోధనసంస్థ గ్రంథాలయమునగల "ఎనుబది రెండు వార్తలు" అను పేరుగల యొక పురాతనముద్రితగ్రంథము నుండి సేకరింపబడినవి ఈ పుస్తకముయొక్క ఏక్సెషన్ నెంబరు: 008026.

## 10 (c) (Palm leaf) ప్రతియందలి పాఠభేదములు

| పుట | పంక్తి | ప్రధానప్రతి (Text) | 10 (c) (Palm leaf) ప్రతి |
|---|---|---|---|
| 1 | 4 | గుణావంతంబులచేత | గుణానంత్యంబుచేత |
| 3 | 3 | ఎట్లన్న: కావేరీతీరంబు | అదియెట్లన్న, కవేరజే విరజ. |
| 4 | 2 | శ్రీమంతండైన | శ్రీమంతుండై |
| 5 | 1 | అప్పాంబిళ్ళ అనే ఆయనకు | అప్పాంబిళ్ళనా యనకు |
| 9 | 18 | నేనున్న తదర్థంబుగా<br>నవతారంబుల విన్న | నేనున్నతదర్థంబవతా<br>రాంతరంబుల విన్న |
| 10 | 19 | యుక్తి కల్పితంబగు | కుయుక్తి కల్పితంబగు |
| 17 | 24 | వశమే? | శక్యమే? |
| 24 | 28 | కయూత్రి | కయితాత్రి |
| 28 | 6 | ఆత్మబంధుండగఘురు. | ఆప్తబంధువుండగఘురు. |
| 28 | 13 | సకలజీవజీవనస్వరూపా! | సకలజీవసంజీవనస్వరూపా! |
| 29 | 2 | పరమపద్వోపాయరూపా! | పరమపరమోపాయరూపా! |
| 35 | 23 | బ్రహ్మ | ముందరికి బ్రహ్మ |
| 39 | 5 | పతితో | అతనితో |
| 39 | 10 | కదలెనట! | తొలఁగెనఁట! |
| 42 | 17&18 | బంధానంతకానల___ | బంధానాంతక కాల___ |
| 44 | 5 | సర్వసమాశ్రయణీయుండయ్యె. | సర్వజనసమాశ్రయణీయుండయ్యె |
| 44 | 9 | సమస్తచేతన__ | శేషభూత సమస్తచేతన___ |
| 46 | 6 | జుగుప్స చేయుచున్నాఁడవో?<br>మదీయా___ | జుగుప్సచేయుచున్నాఁడవో?<br>నిజస్వరూపస్వభావంబు లెవ్వ<br>రెఱుంగుదురని గణించు<br>చున్నాఁడవో? మదీయా___ |
| 49 | 17 | ఇవ్విధంబున | ఇన్నివిధంబుల |
| 55 | 8 | దగవైన | దగులైన |
| 55 | 12 | విడువనుకొని | విడుదేసికొని |
| 56 | 2 | దగులైన | దగవైన |
| 59 | 12 | విడుమంటిచోటు | విడుబట్టుచోటు |
| 60 | 11 | అపారకరుణాంబుధే! | అపారకరుణాంబుధీ! |
| 60 | 22 | బనులఁదలపఁజేకాయకంబున— | పనుల కలవరచి కాయకంబున— |

## 1949 లో ముద్రితమైన ప్రతియందు లభించిన పాఠభేదములు

| పుట | పంక్తి | ప్రధానప్రతి (Text) | ముద్రితప్రతి (1949) |
|---|---|---|---|
| 1 | 22 | గోరెదవంచేని | గోరెదనంచేని |
| 8 | 18 | వెలయు సుమీ। | వెలయుమీ। |
| 10 | 24 | వాకశించుకొని | సేకరించుకొని |
| 11 | 2 | నిరాతంకులైరి. | నిరాటంకులైరి. |
| 20 | 11 | వాకిట | తలవాకిట |
| 20 | 12 | అన్యవిషయ— | అన్యశేష— |
| 25 | 8 | అశరణ్య శరణ్యా। | అశరణ శరణ్యా। |
| 37 | 19 | జేయుచున్నచోటి— | జేయుచున్నచ్చోటి— |
| 38 | 12 | పలుగణి సంధుల | పలుగాణి సందుల |
| 41 | 23 | అమాన స్తుత్యా। | అమానవస్తుత్యా। |
| 44 | 12 | లౌదురా। శేషనగరాధినాథ। | లౌదురా। శేషభూత సమస్త చేతనా। శేషనగరాధినాథ। |
| 49 | 8 | విశ్రాంతంబగు. | విశ్రాంతంబగుట. |
| 49 | 19 | జెంగిపోనీయక | తొలంగిపోనీయక |
| 50 | 12 | దిగ్విజయవ్యాపారంబున | దిగ్విజయవ్యాజంబున |
| 51 | 4 | రామకృష్ణ నృసింహాది— | నృసింహరామకృష్ణాది— |
| 52 | 11 | వేదశాస్త్రభరాక్రాంత— | వేదభారభరాక్రాంత— |
| 53 | 20 | గరుడగ్రావ— | గారుడగ్రావ— |
| 58 | 10 | సమయానంతరంబున | సమనంతరంబున |
| 60 | 2 | క్షీరసాగర వారణాచల— | క్షీరసాగర శ్రీరంగ వారణాచల— |
| 62 | 15 | భక్త్యర్చనాధురీణ భగవద్యాగమహా— | భక్తసేవాధురీణ భగవద్భాగవత— |
| 62 | 16 17 | ప్రవర్తకారోహణ శ్రీమదిల్లిందల(ల)— | ప్రవర్తకారోహణ ప్రవీణ శ్రీమదిల్లిందల— |
| 62 | 20 | ప్రసాదా (దిస్పర్శవేది)— | ప్రసాదాది పరిశవేది— |
| 62 | 23 | పరస్థమత్తగజంబుల | పరవాది మత్తగజంబుల |
| 63 | 3 | (పర) దేవతా— | ఇతర దేవతా— |

# కృతజ్ఞతలు

తమ గ్రంథాలయములో గల గ్రంథములను అడిగినదే తడవుగ పరిశీలింప నొసంగుటతోపాటు, ఈ పరిశోధన పథమున ఆదినుండియు నాకు మార్గదర్శకులై యున్న గురువర్యులు ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డి (Ex-Director, S. V. U.O. R. Institute) గారికి—

ఈ విశిష్టకృతి యీ రీతిగా వెలుగుచూచుటలో ముఖ్యకారణులు ప్రొఫెసర్ డి. శ్రీధరబాబు (Director-in-Charge, S.V.O R.I.) గారికి—

ఓపికతో ఈ గ్రంథ మాద్యంతము ఆలకించి, అందలి సంప్రదాయార్థములను, విశిష్టాద్వైత దర్శన విశేషములను ఆదరముతో విశదముగా నుపన్యసించిన గురువర్యులు ఉ॥ వే॥ శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యులు (Head, Dept. of Nyaya (Retired), S. V. O, College, Tirupati) గారికి—

ఈ స్తుతివచన కృతిని, ముఖ్యముగా నిందలి యవతారికా శ్లోకములను పరిష్కరించుటలో తమ అమూల్యములైన సలహాలను, సూచనలను ఆదరముతో ప్రవచించిన గురువర్యులు ఉ॥ వే॥ శ్రీమాన్ యన్. సి. వి. నరసింహాచార్యులు (Director, Sri Bhagavatha Project, T. T. D., Tirupati) గారికి—

ఈ గ్రంథమునకు సంబంధించిన శ్రీ వైష్ణవ సంప్రదాయ రహస్యార్థములను ఆదరముతో తెలియజేసిన సహోద్యోగులు, అత్యంతాప్తులు కీ॥ శే॥ కె. శ్రీనివాసవరదన్ గారికి—

ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయమునందలి 'రామానుజ విన్నపముల' ప్రతిని పరిశీలించునిమిత్తము అనుమతించి, తమ సాహాయ్య సహకారముల నందించిన ఆ గ్రంథాలయాధికారులకు, తత్సహయోద్యోగులకు—

కోరినవెంటనే తమయొద్దనున్న 'రామానుజ విన్నపముల' ముద్రితప్రతిని 'జిరాక్సు' తీయించి పంపిన మిత్రుడు శ్రీమాన్ కె. పెరుమాండ్లాచార్యులు (Z P. Highschool Ghatkesar) గారికి—

ఈ కృతి అవతరించిన 'తెట్టు' గ్రామమునందలి వేణుగోపాలస్వామి వారి ఆలయమునుగూర్చి, అచ్చటి స్థలపురాణవిశేషములను గూర్చి వివరించిన ఆ యూరిపెద్దలు మ.రా.రా.శ్రీ కామకోటి వాసుదేవరావు గారికి, వారి సోదరులకు, తదితర గ్రామ ముఖ్యులకు—

ఈ కృతి నీవిధముగా తమ ముద్రణాలయమున ముద్రింపజేసిన మాస్టర్ ప్రెస్ అధినేతలు శ్రీమాన్ ఎ. వి. శ్రీనివాసాచార్యులుగారికి— ఈ గ్రంథ ప్రచురణలో నాకు చేదోడువాదోడై మిగుల సహకరించిన సహోద్యోగి, ఆప్తమిత్రుడు శ్రీ టి. అనంతనారాయణగారికి—

కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

శ్లో॥ రామానుజాయ నాథాయ
యతీంద్రాయ మహాత్మనే।
కృపామాత్రప్రసన్నాయ
లక్ష్మణార్యాయ తే నమః॥

విభవ వైకుంఠైకాదశి
తిరుపతి
19—12—1988

— కె. జె. కృష్ణమూర్తి

# అవతారిక*

శ్లో॥ వేణునినాదవినోదీ విష్ణుః, శ్రీ కృష్ణచిత్తపుత్రీయమ్।
రక్షంతు శేషనగరీం రక్షాదీక్షశ్చ భాష్యకారోఽయమ్॥ ౧

శ్లో॥ అవ్యా ద్దయాసుధాబ్ధి ర్గంభీరస్వాంత యుజ్జ్వల శ్రీశః।
శ్రీ శేషనగరధామా రామానుజయోగిరాణ్ణతానస్మాన్॥ ౨

శ్లో॥ విఖ్యాతా భువి పంచయోజనమితే శ్రీ వేంకటక్ష్మాభృతః
పశ్చా త్తెట్టుపురీతి బాహుతటినీతీరే గజారణ్యకే।
ధన్యా శ్రీనగరీవ శేషనగరీ, తత్ర స్థితో భాష్యకృత్
భూయా ద్రూఢముదత్ర తత్రభవతాం స శ్రేయసే భూయసే॥ ౩

శ్లో॥ శ్రీమతే రామానుజాయ నమ శ్శేషస్వరూపిణే।
శ్రీ శేషనగరీశాయ సేవకామరశాఖినే॥ ౪

శ్లో॥ అత్రాస్మి లేఖకోఽహం, వక్తా స్వయమేవ భాష్యకారో హి।
మమ శేషనగరవాసీ మనసి చ వచసి ప్రవిశ్య శేషాత్మా॥ ౫

శ్లో॥ శ్రీమద్గార్గ్యకళతారిదేశికవర శ్రీపాదపద్మాశ్రయం
(భక్తి) జ్ఞాన విరక్తి శాంతికరుణావాత్సల్య రత్నాకరమ్।
ఇల్లింబాన్వయ వేంకటార్యతనయం తల్లబ్ధమంత్రార్థకం
వేదాంతద్వయమర్మనిష్ఠ మనిశం రామానుజార్యం భజే॥ ౬

శ్లో॥ శ్రీగార్గ్య వేంకటాచార్య శ్రీపాదకమలాశ్రయమ్।
జ్ఞానవైరాగ్య సంపన్నం రామానుజగురుం భజే॥ ౭

---

కవి యీ వచనకృతికి సంస్కృత శ్లోకములలో అవతారికను రచించియున్నాడు. పై అవతారికా శ్లోకము లేడింటిలో తొలి యైదు శ్లోకములు కవి రచించినవి. ఈ యైదు శ్లోకములవలన వెల్లడియగుచున్న విషయముల సారాంశము సంగ్రహముగా నిది:

"ప్రసిద్ధమగు వేంకటాచలక్షేత్రమునకు పశ్చిమదిశను ఐదామడల దూరమున ఏనుగుల కోనలో బాహుదాతీరమునందు 'తెట్టుపురి' యున్నది. ఈ తెట్టుపురికే

'శేషనగర'మని నామాంతరము. ఈ యూరిలో గోదాదేవీ సమేతుడైన వేణుగోపాలదేవుని గుడి కలదు. అందు శ్రీరామానుజ యతిరాజు సుప్రతిష్ఠితుడై యున్నాడు. వీరలు ముగ్గురు ఈ శేషనగరిని, ఇందలి భక్తులైన మమ్మెల్లరను రక్షించుచుందురుగాక!

శేషస్వరూపుడును, శేషనగర నివాసియునైన యీ భాష్యకారులు నామనస్సులోను, వాక్కునందును ప్రవేశించి, స్వయముగా ఈ వచనములను నాచే పల్కించియున్నాడు. కావున ఆయనయే యీ గ్రంథమునకు వక్త. నే నిచ్చట లేఖకుడను మాత్రమే!''

[Note పై అవతారికా శ్లోకములలో కవి పేర్కొనిన తెట్టుగ్రామము చిత్తూరుజిల్లా మదనపల్లి తాలూకాలో మదనపల్లికి వాయవ్యదిశలో 14 కి. మీ. దూరమున నున్నది. ఈ గ్రంథమందలి ప్రతి వచనము చివరి మకుటమున "శేషనగరాధినాథ! రామానుజ!..............."– ఇత్యాదిగ సబోధింపబడిన సంబోధనయందలి 'శేషనగర' మీ తెట్టుగ్రామమే!]

పై అవతారికయందలి చివరి రెండు శ్లోకములు గ్రంథకర్త రచించినవి కావు. అవి ఈ కవియెడల మిగుల భక్తి ప్రపత్తులు గలిగిన ఆయన శిష్యుడో, కుమారుడో సమకూర్చినవి. వీటివలన ఈక్రింది యంశములు విదితములగు చున్నవి:

'రామానుజాచార్యుడు (కవి) గార్గ్యగోత్రజుడు. ఇల్లిందల వేంకటాచార్యుల తనయుడు. శఠకోపాచార్య గురువర్యుని (బహుశః కవియొక్క తాత) శిష్యుడు. ఉభయవేదాంత పారంగతుడు. భక్తి, జ్ఞానము, వైరాగ్యము, శాంతి, వాత్సల్యము మున్నగు గుణవిశేషములు గల యుత్తమ చరితుడు.'

# యతిరాజశేఖర వచనములు

(రామానుజ విన్నపములు)



## 1

శ్రీవైకుంఠనాథ హృద్యస్వరూపా! గుణానంతంబులచేత ననంతుండవని యును, ప్రకృష్ట జ్ఞానబల సంపన్నత నివాస శయ్యాసనపాదుకాంశుకోపధాన వర్షాతప వారణాది శరీరభేదంబుల శ్రియఃప్రతికిఁ దత్తదవసరోచితాశేషశేషభావంబులొందిన కతంబున శేషుండనియును ప్రఖ్యాతిగాంచిన నిత్యసూరివర్గ 1ప్రధానుండే యీతం డని వెలసి, అశేష ప్రాచీన దేశికాశయ నిశ్చయక్రమంబున * "జ్ఞానీత్వాత్మైవ మే మతం" ఇత్యుక్తస్థల జ్ఞాని శబ్దంబున కర్థంబు నీవే యవుటచేత, భగవ దర్చనంబులెల్లఁ దదంతరాత్మభూత భవత్పర్యంత పర్యవసానంబులే యవుఁ గావున, సంతతోత్సవంబులును, సంతతమంగళంబులును దేవరవారికే ఘటి యించె. మేలు! మేలు!! మమ్మేలు శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 2

ఉభయ విభూతినాయకా! మీదివ్యావతారంబుప కవ్యాహతైశ్వర్యంబు; మీ దివ్యరూపంబున కనవరత మంగళంబు., మీ దివ్యగుణంబుల కనంత ప్రకా శంబు; మీ దివ్య విభూతుల కపార సమృద్ధి; మీ దివ్యసంకల్పంబున కనంత ాయ పూర్వక సంసిద్ధి; మీ దివ్యసూక్తుల కతులిత కౌశలంబు; మీ దివ్య చేష్టి తంబుల కభ్యుదయ పరంపరాభివృద్ధి; మీ దివ్యమహిమ కనవధికాతిశయ విభవంబు; మీ దివ్యకీర్తి కఖండ బ్రహ్మాండ మండల వ్యాప్తి; మీ దివ్యాజ్ఞ కనంకుశ పరాక్రమ స్థైర్యంబు; మీ దివ్యచరణారవింద సేవకవర్గంబున కనర్గళ జ్ఞానభక్తి వైరాగ్య సంపదానందావాప్తులం గోరెద. ఏమిటికిం గోరెదవంటేని విన్నవించెద! అశేష చిదచిద్వర్గంబు ప్రమేయంబైన బ్రహ్మంబున కధీనంబు;

---

1. ప్రభావ మండితుండన వెలసి, *"భగవద్గీత VII-18.

ప్రమేయంబు ప్రమాణాధీనంబు; ప్రమాణంబు [1]ప్రమాత్రధీనంబు; నీవు ప్రమాత్రగ్రేసరుండవు. లెస్స విచారించి చూచిన, నీలెస్సయే ప్రకారప్రకారీభూత ప్రపంచ బ్రహ్మల లెస్సకు మూలంబయ్యెఁగావునఁ బ్రార్థించితి. చిత్తగింపుమీ! శేషనగాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 3

ఆచార్య లక్షణ లక్షితా! నీవు భగవత్ప్రపన్నులకు ఘటకభావంబు వహించుచు సర్వోపాయశూన్యులకుస్వయమేవోపాయభావంబువహించుచుఁజేతనోజ్జీవనైకహేతువైన వాడవు. అందొక్కటి లక్ష్మి ధర్మంబు; ఒక్కటి నారాయణు ధర్మంబు. ఈ రెండు ధర్మంబులు నీయందె కానుపించిన కతంబున. ధర్మంబులు ధర్మివ్యతిరిక్తములై యుండవు గనుక,వారిరువురు నీరూపంబున నేకవ్యక్తియౌట సిద్ధంబు. *"రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" అనియెడి. ల్లుగి నీయ తారాంతరమ్ముల యందుంబలె భిన్న వ్యక్తులైనను, శ్రీసన్నిధానం బబ్బినచోటఁ గాక రుక్మిప్రభృతులగతిఁ జేతనులు సాపరాధులయ్యును నుజ్జీవింపుదురు. శ్రీసన్నిధానంబు దొరకనియెడల రావణకంసాదుల చందంబున నశించే పోదురుగదా! యని విచారించి, ఏకవ్యక్తియౌట నీయర్థంబు దేవరకుఁ బరమాంతరంగుడై భాగినేయుండైన దాశరథిసూరి యుపన్యసించెఁ గావున. మంత్రరత్నంబున కర్థంబు [4]నీవె యని తెలిసె. శరణంటి రక్షింపుమీ! శేషనగాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1. ప్రమాత యధీనంబు.

*శ్లో॥ రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని।
అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ॥

ఈశ్లోకము విష్ణుపురాణమునందలి'ఇంద్రకృతలక్ష్మీస్తుతి'లోనిది. చూ. 1వఅంశము. 9 వ అధ్యాయము

2. యవతారాంతరములయందువలెనే

3. నశియించి. 4. నీవ

## 4

శ్రీరంగేశ విజయధ్వజా! మిమ్ము విష్వక్సేనులుగా నూహించి, అవిఘ్న పరిసమాప్తికొఱకుఁ గృతిముఖంబున నారాధించినాఁడ. ఎట్లన్న: కావేరి తీరంబు ప్రణవాకార వేదశృంగగర్భరంగవిమానంబె వైకుంఠమందిరంబు; తన్నివాసియె వాసుదేవుండనుటచేతఁ బ్రత్యక్ష పరమపదంబు రంగస్థలంబనుట సకలలోక ప్రసిద్ధంబు. అచట నీవు విష్వక్సేన ముద్రయగు వేత్రత్రిదండంబు హస్తంబునం బట్టి తత్కైంకర్యంబులెల్ల దిద్దుటయును, దత్పర్యాయంబులగు దివ్య[1]దేశంబుల యందెల్ల నీయాజ్ఞ చెల్లించుటయును సాక్షిగాఁగ, బ్రత్యక్షంబునకుఁ బ్రమాణ మేల? కావున నిన్నుఁ బ్రార్థించినంతటనె విష్వక్సేన ప్రార్థన మాకబ్బె, వితర్కించుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 5

శ్రీభాష్యకారా! ఉభయపక్షంబుల ద్విజపరులెందఱందఱకు నీవు పొత్తగుచు, నాదయుడవై, బహువిధ వేదశాఖలెల్ల నీ వాఙ్ముఖవిధేయంబులౌట చేతఁ ద్రయీమయుండవనంబరగుచుఁ, గాషాయ వస్త్రోత్తరీయారుణిత స్వర్ణవర్ణ శరీరంబును, ధవళమృణ్మయోర్ధ్వపుండ్ర విరాజిత వదనమండలంబును, విస్ఫారిత స్ఫటికభోగి భోగోపఘాన జలవార్ధకాంచితాగ్రభాగ త్రిదండ గ్రాహి కరంబునుం [2]గలుగఁజూచి, నీవు సాక్షాద్వైనతేయుండవని, సేవించితి. [3]కాదేని, శ్రియఃపతి అనంతశయన, పురుషోత్తమ స్థలంబుల నుండి కృతప్రతికృత్యాయంబున నిన్ను [4]గురుంగ, కూర్మ స్థలంబులందు నిలిపి, నీవు విష్ణురథుఁడవౌట జగద్విదితంబు చేయున్నే? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 6

శ్రీనిధి శ్రీప్రదా! నీవు కళ్యాణగుణ కలశాంబురాశివి. నీయందుత్పన్నం బగు సద్విద్యోపన్యాస రూపంబైన వేదార్థసంగ్రహంబను నమృతంబు అసుర

1. దేశంబులెల్ల
2. గలుగఁగాఁజూచి, 3. అటుకాదేవి, 4. కురంగ

ప్రకృతులపాలికిఁ దప్పి భూసురవరుల పాలికి వచ్చె. నీవలన నలమేలుమంగాభిధానయగు లక్ష్మివి శేషాచల నివాసుండగు హరి పరిగ్రహించి శ్రీమంతంబైన తన శ్రీనివాస నామంబు యథార్థంబుఁ జేసికొనెఁ గావున, నీవు నా పాలమున్నిటి చందంబున నతనికి మామవైతివి. అతండు తొండమాన్ చక్రవర్తికిఁ దనశంఖ చక్రంబులిచ్చి, మగుడి యెవ్వరిచేతఁగైకొనక, నీవు పంచాయుధాత్మకుండ [1]వనియెటి తెలివిచేత నీ యవతార సమయంబున నెదురుచూచుచు నీచేతనె శంఖ చక్రంబు లందుకొనియె. నీ పంచాయుధాత్మకత్వంబు రంగామృతకవీంద్రుండు సమక్షంబున నీచేతనే యొప్పించె. ఇది ప్రపన్నగాయత్రివేత్త లెఱుంగుదురు. అటుగనుక, పరాకు! పరాకు!! నిన్ను సన్నుతించుటె పంచాయుధంబుల సన్నుతించుట సుమీ! అమేయవైభవా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 7

యాదుశైలనాథజనకా! తొల్లి నీవు రామప్రియుల నిమిత్తంబున యాదవాచలంబు వెడలి, ఢిల్లీ నగర పర్యంతబు దండుచేసి, తోడితెచ్చి పూజార్హునింజేసి. నిత్యోత్సవ ప్రముఖ సకలవిధకైంకర్యంబు లొనరింపంజూచి, ఆ చెల్వపిళ్ళ 'యిందుకు సదృశప్రత్యుపకారంబు సేయంగలనె?' యని వితర్కించి, నిన్ను జనకునింగా వరించి, తాను 'యతిరాజ సంపత్కుమారుండ' ననుకొని నీకు సర్వప్రకారపరతంత్రుండై, నీవు నియమించిన [2]పనులెల్లఁ జేసి చెల్లింపుచు, అంతటఁదృప్తింబొందక, సార్వజ్ఞ కృతజ్ఞత్వాది గుణనిధిగనుక, నీవె గర్గవంశంబున నైనారు రూపంబుఁ గైకొనుట గనుంగొని, ఆ మహిమ ప్రకాశింపించఁదలంచిన వాడై, తన సన్నిధికి ద్వితీయవర్ణు లిరువురు వచ్చి ప్రాణాచారంబుపడి, పరమ పదంబిమ్మని యడిగిన 'అది శ్రీ వైష్ణవమూలంబుగా రావలయు, మీరు [3]తిరుపతి కరిగి, యచట వసియించియున్న పరవస్తునైనారు నాశ్రయించి చీటీదెందు. ఇచ్చెద, నవిన, వారు నటువలెనేవచ్చి! నైనారును సేవించి, తద్వృత్తాంతంబు విన్నవించి, సంవత్సరపర్యంతం బనువర్తనంబు చేసియుఁ దాము ప్రసన్నీకరించలేక, పర

1. వనియెడి — 2. పనులెన్నియో చేసి చెల్లింపుచు,
3. తిరుమల కరిగి.

మాస్తులైన అప్పాంబిళ్ల [1]అనె ఆయనకు విన్నపంబు చేసిన అమ్మహాత్ముండు పురుషీకరింపఁగా నాశ్రయించి చీటీ వ్రాయించి పుచ్చుకొని, మగుడి తిరునారాయణ పురంబునకు వచ్చి చెల్వపిళ్ల సన్నిధి నచ్చీటి సమర్పించిన, నదియు రాజముడిలోఁ [2]గూర్చి శిరసావహించి, వారికిని వారికైన బంధువులకు మున్నూటికింగూడ పరమపదంబిచ్చెనట! నయనారు నీ యవతారంబే గాకయుండిన [3]నతండింత ఖూటు పడుటెట్లు? [4]అట్టి దేశికవరుని సమ్బంధంబు తత్సంబంధ సంబంధ పరంపరా ముఖంబునఁ గలవాడను గనుక, 'వీడు స్వసంబంధుండె' యని విచారించికదా నీవు నన్నుఁ బరిగ్రహించితివి! నా మనోవాక్కాయవృత్తులు నికె శేషంబు చేసికొంటివి. నేఁ [5]బోవుపోకలెల్లా ముద్దుచేసికొంటివి. నీ యాశ్రిత వత్సలత్వం బెంతని [6]వర్ణింతు? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 8

అమితకీర్తీ! వేయి ముఖంబులును, రెండువేల జిహ్వలుఁగల ఆది శేషుండవట నీవు! దేవ గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్ష సిద్ధ సాధ్య విద్యాధరాది గణంబులకు నీ గుణంబు లిన్నియని గణింప శక్యముగాదఁట! ఇట్టి నిన్నేకవక్త్రుండ, నేక జిహ్వుండ, మానవమాత్రుండనైన నే సన్నుతింపఁ దలంచుట చాలా లజ్జావిహీనకృత్యంబె యౌను. అయినఁ గావిమ్ము. నాకొక బలిమి గలుగఁగా విచారించి యారంభించినాఁడను. అదెట్లన్న! శారద నీకత్యంత వశంవద. తదామోద సంపాదకంబు భవదీయస్తవంబు గావున, నిన్ను సన్నుతించ మతి నెంచినచోఁ దత్సాహాయ్యంబు నా కనర్గళంబు గాఁగలదని సుమీ! శేషనగ రాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 9

ప్రస్మత్స్వామీ! అవిదితదేవతాంతరవృత్తిని నీకు శేషమైన వాఁడను. శేషవస్తుస్వరూపంబు పరార్థమై, స్వానర్హమె యగుట జేసి. జ్ఞాతనైన నే నీకు

---

1. అనాయనకు 2. చేర్చి- 3. నతనికింత 4. ఇట్టి - 5. పోయినపోక లెల్ల 6. గణింతునె!

శేషమైనప్పుడె తద్ధర్మభూతజ్ఞాన, తదవస్థా విశేషరూప కర్తృత్వ, భోక్తృత్వాది సమస్త వ్యాపారంబులెల్ల భవదీయంబులె కావున. శేషివైన నీపె శరీర శరీరి రూపైక్యంబున నా కాత్మవై నిలిచి, కృతిముఖంబున నీవె నిన్ను సన్నుతించు కొనువాడవు. అయినప్పుడు నీ వాణే విలసితంబై సహస్రముఖంబులఁ బుంఖానుపుంఖంబులుగా నావిర్భవింపంగలది. నే నచిత్కల్పుండను, ఈ స్తోత్రోద్యమంబు నీదె, నీదె సుమీ! పరాకుశాయక విన నవధరింపుము. నా తండ్రీ! నన్నుఁ గన్నవాఁడా! నా కులదైవమా! శేషనగలాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 10

వాచామగోచర వైభవా! మీ మహిమ యంతయుఁ దెలియుటకు నేనెంతటి వాఁడను? ఉభయ విభూతి రక్షణదక్షుండవు నీవని ఉభయ కావేరీమధ్యవర్తికిం దెలియును. అనన్యభోగరూపకైంకర్యపరుండవౌట హస్తిగిరీశ్వరునకుం దెలియును. ఫణీంద్రుండె నీవౌట బదరీ నారాయణునకుం దెలియును. విష్వక్సే నాంశ నుదయించినవాఁడవని వైకుంఠనాథుని పట్టమహిషికిం దెలియును. కలి కలుషవిదారివని కారికుమారునకుం దెలియును. భవత్ప్రణీత భాష్యస్వారస్యంబు భగవంతుండగు కురంగపూర్ణునకుం దెలియును. హరిదర్శనస్థాపకుండవని యామునార్యులకుం దెలియును. గురుతర దయావంతుండవని గోష్ఠీపూర్ణునకుం దెలియును. చేతనకోట్యుత్తారకంబు నీకు వాచకంబైన చతురక్షరి యని శ్రీవత్సాంక మిశ్రులకుం దెలియును. తావకావతార ప్రయోజనంబు దాశరథి సూరికిం దెలియును. హిరణ్య గర్భాది విభూతులు లెక్క పెట్టరు నీ యాశ్రితులనుట యెంబారుకుం దెలియును. శ్రియఃపతి పంచాయుధంబులె నీవౌట శ్రీరంగసుధాకరేంద్రునకుం దెలియును. మీ శ్రీపాదతీర్థప్రభావంబు మేలునాటి [1]వడుగునంబికిం దెలియును. వాదావసరంబున నీ [2]వాచాచాతురి వరదరామానుజమౌనికిం దెలియును. సమస్త పూర్వోత్తరాచార్య ముక్తి ప్రదాతవు నీవని సర్వజ్ఞభట్టరుకుం దెలియును. గురు పద మూర్ధాభిషిక్తుండవౌట కృష్ణపాదులకుం దెలియును. అంతిమోపాయంబు నీవె యౌట అతని పుత్రునకుం దెలియును. మంత్రరాజతాత్పర్యనిష్ఠ మీ యంఘ్రి

1. వడుఘునంబికిం 2. వాక్చాతుర్యంబు

కమలసేవె యని మనవాళమహాముసులకుం దెలియును. సకల వేదాంతహృదయ వేదివని శారదకుం దెలియును. శమితకుమతప్రచారుండనని శంకరాదులకుం దెలియును. [1]అతిశయ వ్యాప్తితో మీ [2]ంవతరించిన దివ్యదేశం బీ శేషనగరం బని ఆచార్య వత్సల కందఱికిం [3]దెలియుట అఖిల జనులకుం దెలియునే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 11

గురుకులాంబుధి చంద్రా! నీవు హారితసగోత్రంబున సకల కళా పరిపూర్ణత నావిర్భవింపంజూచి? వేదవేదాంతాంబుధులెల్ల మోదంబులం బొంది యుప్పొంగె. స్మృతేతిహాసేందీవరకైరవంబు లతిహాసోల్లాసభాసమానంబులయ్యె. పుతాణచకోరంబులు పోషితప్రాణంబులగుచు సవిలాసంబులై [4]సంచరించె. గుహదేవ, టంక, ద్రవిడాది గురువచన సస్యంబు [5]లాహ్లాదాస్యంబులై చెలంగె, కాపిల, కౌమారిల, కాణాదాది మతాంధకారకదంబం బవిసె. శాంకరీయ పంకజంబులు సంకోచంబుఁజెందె. భాస్కరీయ తస్కర ప్రచారంబు దూరంబున గూఢంబయ్యె. యాదవప్రకాశ, యజ్ఞమూర్తి హృదయచంద్రకాంతపాషాణంబులు గరంగె. ఉపనిషదుపనిషద్వేద్యరమణీరమణ [6]విహరణంబు విజృంభణంబు నొందె. సంసారఘర్మసంతప్త కూరనాథ, కురుకాధినాథ, గోవిందపాద, దాశరథి ప్రముఖ ముముక్షు జన వర్గంబు నీ కరస్పర్శంబునఁ దాపంబులం బాపుకొని, చల్లనై [7]యుల్లసిల్లెనె! సర్వజ్ఞ చూడావతంసా! ద్విజరాజా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 12

క్షాంతిమతీనందనా! ఇక్ష్వాకుప్రముఖానేక రాజ పరంపరకు జన్మభూమియె కాదె అయోధ్యానగరంబు? నా దెవ్వరైనఁ బుణ్యక్షేత్రంబనుచు స్మరించిరె? శ్రీరామావతరస్థలంబైన కారణంబున స్మరణయోగ్యంబై, ముక్తిప్రదక్షేత్రంబులలో నగ్రగణ్యంబయ్యె. అటువలెనె మధురానగరంబును యదుప్రభృతి మహా

---

1. అతిశయితవ్యాప్తితో 2. రధివసించిన 3. దెలియును. అఖిల.
4. సంచలించె. 5. లమ్లానాస్యంబు లెసఁగె. 6. విహారంబు
7. యుల్లసిల్లిరి.

రాజలోకంబునకు జన్మభూమియె కాదె? నా డెవ్వరైన శుక, వ్యాసాది మహర్షుల పుణ్యక్షేత్రంబని వర్ణించిరె? శ్రీకృష్ణుం డవతరించిన విశేషంబునం గదా, * "అయోధ్యా మధురా" యనినట్టు ముక్తి ప్రదంబగుచు, స్మరించయోగ్యమై, తదధిష్ఠిత బృందావన, నందవ్రజ, ద్వారకాది పుణ్యస్థలంబులతోఁ గూడ సమగణితంబయ్యె. ఆ 1యందంబున మహాభూతనగరంబునుం బురాణ ప్రసిద్ధం బైనను, నెవ్వరైన గణించిరె? స్మరించిరె? నీ వచ్చోట నవతరించిన పిమ్మట, గాబోఁలు, రామకృష్ణావతారస్థలంబులకన్న బ్రహ్మ వేత్తల కాదరణీయంబయ్యె. అటువలెనె యీ శేషనగరంబును నీ వధిష్ఠించి నిలిచి ప్రభావంబుఁ జూపుచున్నా డవు గనుక, నీ యవతార స్థలంబులతో సమంబగుచు, భూవలయంబున నెన్నిక కెక్కె. ఇఁక దినదిన ప్రవర్ధమాన మహావిభవంబు లందుచు వెలయు సుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 13

యామునాచార్య కరుణైకపాత్రా! కాంచీనగరంబులో నీవు బాల్యంబు నందు యాదవప్రకాశసంకాశంబున శాస్త్రాభ్యాసంబు సేయువేళ నతండు + సత్యాది శ్రుతి కపార్థ కల్పనంబుఁ జేసి శిష్యులకుంజెప్పఁగా, నట్లుకాదని, సత్యాది శబ్దం బులచేత క్షణికవ్యావృత్తినిన్ని, అచిద్వ్యావృత్తినిన్ని, చేతనవ్యావృత్తినిన్ని ₂బోధించఁగా, నిత్యమై, చేతనాచేతనవిలక్షణమైయుండును బ్రహ్మమని దిద్దుట విన నవధరించి, మిమ్ముఁ జూచు వాంఛ నాళవందారు కంచి కరుగుదెంచి, స్వర్ణ వర్ణోదారదీర్ఘ బాహులోచన కర్ణాద్యవయవాంచితంబగు తావక సమున్నత సుందరా కారంబుఁ జూపి కాంచీపూర్ణు 'లతఁడె యిళయాళ్వా'రనం, గటాక్షించి, హర్షించి,

---

*శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా ।
పురీ ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః ॥

ఈ శ్లోకము కాశీఖండమునందలి 'సప్తపురీప్రశంస'లోనిదిగా దెలియు చున్నది.

1. యర్థంబున

+"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని యీ శ్రుతి వాక్యము. ఇది తైత్తిరీయోపనిషత్తునందలిది. చూ. 2 అధ్యా: 1వ మంత్రము,

₂బోధించి-అనినచో అన్వయము సుకరమగును.

యతని నీ దర్శన ప్రవర్తకుంజేయు'మని వరదరాజులకుఁ బ్రపత్తిచేసెనఁట' అదె పరగత స్వీకార రూపోపాయంబని విచారించి, నీ వతని నుత్తారకునిఁగా వరించి, *''యత్పదాంభోరుహ ధ్యానే''త్యా ద్యనుసంధానం బనవరతంబునుం జేయుచుఁ, దదేకప్రవణత నాచార్యాభిమాన స్వరూపంబిదె యని [1]తెలివిపఱచితివి గదా। శేషనగరాధినాథ। రామానుజ! నమో నమో యతిరాజశేఖరా।

## 14

ధర్మ్మత కదంబ కాదంబినీ ఝుంఝూమారుతా! స్వాయంభువ మన్వంతరంబున జంభనముని [2]ప్రముఖదైత్యులు 'చక్రాయుధుతోడ వైరంబు మనకేల' యని, తద్భక్తులగుచు, వేద వేదోపబృంహణమార్గంబు లనుసరించి. అత్యంత ధర్మాచరణశీలురై, అధిక బల పరాక్రమ సంపన్నత నజేయులౌకొని, దాయాదభావ ప్రయుక్త వైరకారణంబున నింద్రాది బృందారక బృందంబుల జయించిన. వారు పరాజయంబునొంది. దైత్యారికడకుం జని, తమకు వచ్చిన పాటు విన్నవింపుచు మొర యిడిన. నతండును వారు తన భక్తులగుటచేత వారిని తానె సంహరింపనుం గూడక, దేవవిరోధులగుటచేత సంహరించవలసి, దీని కెట్లని విచారంబుచేసి, అధర్మప్రవర్తకులుగా నొనరించిన సాధించవచ్చునని, తదర్థంబుగాఁ బార్వతీపతి నాకర్షించి, 'నీవు తామసమోహనార్థంబుగాఁ గపిల, కణాద, వాచస్పతి ప్రముఖుల నావేశించి, వారిచేత వేదబాహ్యమతంబు లుపన్యసింపఁజేయుచు, నీవు న్నుపనఁ సింపు; మిది దేవహితార్థంబు. '[3]నేనున్ను తదర్థంబుగా నవతారంబుల నిన్ను బూజసేతు విను' మని యొడంబఱచినఁ, గానిమ్మని, తదనుజ్ఞ న్ల పాశుపత, శైవ, బౌద్ధపర్యాయాద్వైత, సాంఖ్య, వైశేషిక, చార్వాకాది దుర్మతంబులం గల్పించి ప్రవర్తింపించినఁ గ్రమక్రమంబుగా జంభాదు లంగీకరించి, భగవన్నిగ్రహ

---

*శ్లో॥ యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।
వస్తుతాముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥

ఇది శ్రీమద్రామానుజాచార్యులు గీతాభాష్యముయొక్క ప్రారంభమున రచించిన ప్రార్థన శ్లోకము.

1. తెలియపరచితివిగదా। 2. ప్రముఖులైన దైత్యులు

3. (ఉ) నేను న్నేతదర్థంబుగా

పాత్రులైరి. తదనంతరం బమ్మతంబులు తత్కార్యమాత్ర పర్యవసానంబు
పోక, చిచ్చల్లుకొన్నగతి గతానుగతిక ప్రముఖ ప్రవృత్తంబులై, లోకంబె
నెఱిఁగవంజేయం 1గడంగినఁ గనుంగొని, ఆబద్ధంబులాడి దిద్దుకొన్న చందంబున
బున ప్రస్మృత నిరసనార్థంబుగా సర్వేశ్వరుండు ని న్నవతరింపంజేసి, నీ మూలంబు
నాత్మసంకల్పంబు నెఱవేర్చుకొనె; నౌరౌర! మేలు! మేలు!! మమ్మేలు శే
నగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 15

వ్యాసోల్లాససంపాదకా! వేదవ్యాసులు వేదాంతసూత్రంబులు ర
యించె. అందుల యర్థంబు శఠవైరి ద్రవిడవాగ్వృత్తిని విదితంబు చేసె. తత్సూ
త్రంబులె కొంద అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞాన ప్రచురులయిన కుదృష్టులు గీర్వా
వాణీవ్యాఖ్యాన మిషంబునఁ దదభిప్రాయం బెఱుంగక చీకాకు పఱచిన, మర్క
హస్త మాల్యప్రాయంబు లయ్యె. నీ వది గనుంగొని, అయ్యో! యని విచా
మంది, తథాభూతసూత్ర పరిపాలనైక ప్రయోజనారంబుగా నావిర్భవించినవాఁడవ
ఇది సత్యంబు. ఎట్లన్న. నది కార్యనుమేయంబె కాదె! సకలవేద్యప్రభావ
శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 16

2వ్రాయి దర్శన తూలానలా! టంక, 3ద్రమిడ, గుహదేవాద
నవీన మహాపురుషప్రణీతానేక భేద భాష్యంబుల వికల్పాటోపంబున శంకించి
శ కరుండు సంకరాపార్థసంకులయుక్తి కల్పితంబగు భాష్యంబున అపర ప్రచ్ఛ
లగు తత్కాల విద్యమాన తామస జనులఁ గొందఱిని మోహింపఁజేసె. అ
తామసమోహనార్థ ప్రణీత ప్రచ్ఛన్న బౌద్ధశాస్త్రం బగుట పద్మపురాణోక్త
ఖండంబునందు సుప్రసిద్ధంబు. అది యంతటనె శమించక, పాముకా
చందంబై, విషంబెక్కివచ్చినట్లు దినదినంబున కంధపరంపరాన్యాయంబున అప
మార్థ, పరమార్థ విభాగ జ్ఞాన శూన్యంబగు లోకంబున విస్తరించిరాఁ జూ
గక్కున నీవు నాకళించుకొని భగవద్బోధాయనవృత్తి ననుగుణించి పరాంకు

1. (ఉ) దగిలిన - 2. మాయాదర్శన - 3. ద్రవిడ.

సూరిభావానుసారిగా బ్రహ్మసూత్రంబులకు భాష్యంబుఁ జేయఁగాఁ జూమీ! టంకాదులు నిరాతంకులైరి. ప్రపంచ మిథ్యాత్మవాదంబు లడంగె. వేదవేదాంతాది శాస్త్రంబులు మిథ్యలై పోక, సత్యంబులై, తత్పథంబులు నిష్కంటకంబులయ్యె. వేదవేద్యంబగు పరబ్రహ్మంబు కల్యాణగుణగణాత్మకంబయ్యె. ముక్తులుం గలరని కనిపించె. ఇవి మొదలైన విభవంబులు నీవలననే కలిగెఁ గనుక, లోకరక్షకుండవైతివి. లోకనాథరక్షకుండవు నన్నునిఁ దప్పేమి? యనవచ్చు. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 17

అఖిలవేదాంతార్థ నిర్ణాయకా! ముముక్షూపాస్యకారణ వస్తు ప్రతిపాదకత్వంబున నుత్తరోత్తర విశేషవాచకంబులగు సద్బ్రహ్మాది సాధారణ శబ్దంబులసాధారణ నారాయణ శబ్ద వాచ్యపర్యవసితంబులైన కారణంబున, తత్పదార్థానురోధంబుగా భేదాభేదఘటకశ్రుతిజాతంబున కన్యోన్యవిరోధంబు లేకయుండ, ముఖ్యార్థపరిత్యాగంబునుం జేయక, యైకకంఠ్యంబు సంపాదించి, కేవల ద్వైతాద్వైత వ్యావృత్తి విశిష్టాద్వైతంబు రాద్ధాంతంబుచేసి స్థాపించిన సర్వశరీరత్వంబునఁ బరబ్రహ్మమె సర్వప్రకారంబుల నున్నదని యభేదంబును సమర్థించితివి. ఒక్క పరబ్రహ్మమె నానాభూత చిదచిత్ప్రకారతయా నానాభావంబుల నున్నదని భేదాభేదంబులను సమర్థించితివి. కార్యకారణత్వాద్యవస్థలయందును జిదచిదీశ్వరులకు స్వరూపస్వభావసాంకర్యంబు లేమిఁగొని భేదంబును సమర్థించఁగా, స్వరూప పరిణామ పరిహారంబున నవికారశ్రుతులు ముఖ్యార్థంబులై నిలిచె. నిర్గుణవాద శ్రుతులు ప్రాకృత హేయగుణ నిషేధవిషయంబులై వ్యవస్థితంబులయ్యె. ప్రకారి నానాత్వానంగీకారంబున నానాత్వనిషేధవాదశ్రుతులు సురక్షితంబులయ్యె. సర్వవిలక్షణత్వ లక్ష్మీపతిత్వేశ్వరత్వ సమస్త కల్యాణగుణాకరత్వాది ప్రతిపాదక వాక్య నికరంబులు త్వదంగీకారంబుననె సురక్షితంబులయ్యె. సకలేతర విలక్షణ బ్రహ్మస్వరూప నిరూపక ధర్మం బఖిలహేయప్రత్యనీకానందరూప జ్ఞానంబె యవుఁ గావున, అపృథక్సిద్ధ ధర్మవాచిశబ్దంబులు ధర్మిపర్యంతమౌటఁబట్టుండి స్వప్రకాశకత్వంబున ధర్మిస్వరూపంబు తాదృశంబని ప్రతిపాదించుటవలన జ్ఞానానందమాత్రవాది వాక్యంబును పాలితంబయ్యె. ఐక్యవాదశ్రుతులు శరీరాత్మ

భావప్రాప్త సామానాధికరణ్యంబున 1ముఖ్యార్థోపపాదనంబె చేయఁగా సుప్రతిష్ఠితంబులయ్యె. ఈ సరసమార్గంబు నీ సిద్ధాంతంబుననె కాని, యితర మతంబులందుఁ గానంబడదు గావున, నీ సిద్ధాంతంబు ముందర నన్యమతస్థుల వాదంబులు తూలాయమానంబులై యెగసి, దిగంత విశ్రాంతంబయ్యె నీ విజయంబు. శేషనగరాధినాథ ! రామానుజ ! నమో నమో యతిరాజశేఖరా !

## 18

జయ వేదార్థప్రకాశక ! జయ ఉభయ వేదాంతార్థప్రతిష్ఠాపక ! మాయిదైత్యమండలీ పుండరీకాక్ష ! పాశుపతశైవభేదపారావారపరంపరా కుంభసంభవ ! బౌద్ధరాద్ధాంత క్షత్రకుల పరశురామ ! చార్వాకఘూక భీకరవిభాకర ! జైనమాన సారణ్య దావపావక ! కాపిలవ్యాళవితాన వైనతేయ ! కాణాదాచల కదంబ శంబో ! కాపాలికానేకపానీక కంఠీరవ ! సకలదుర్మతతూలజాల ఝంఝూనిల ! బాదరాయణ పరాంకుశ పక్ష రక్షణ దక్ష ! పరాశర బోధాయనాది భావప్రకాశక ! నాథ యామున నిర్ణీత పథానురోధిబోధ! శేషనగరాధినాథ ! రామానుజ ! నమో నమో యతిరాజశేఖరా !

## 19

ఉభయవేదాంత 2నిదానభూతా ! నీవు శ్రీభాష్యంబు సేయువేళ సాక్షాద్భాగినేయుండైన దాశరథిమిశ్రుండు సమక్షంబున నుండియు న్నతనిచేత వ్రాయించక, కూరేశమిశ్రులంగొని లిఖింపించుటకుఁ గారణంబేమి ? అవులే ! నీవు రామైకప్రవణ లక్ష్మణుండవు. అది రామ శబ్దాభిధేయ పరబ్రహ్మస్వరూప రూపగుణ విభూతివేదకంబు గనుక, రామాత్మకుండైన వేద్యుండె యితండని తత్సమ్మతంబుగాఁ జేయందలంచి వచ్చెఁ గాఁబోలు ! అట్ల కాదేని, యతండు వ్రాయక యూరకయున్న ప్రదేశంబులనెల్లఁ బూర్వయోజనలనెల్ల విడిచి, యోజనాంతర రచనలు చేతువె ? ఇత్తెఱంగున వేద్యుండె వచ్చి లేఖకుండై నిలిచెఁ గనుక, యిది వేదాంతవేద్యసమ్మతభాష్యంబని వ్యక్తంబయ్యె. తల్లిఖితభాష్యంబుఁ

---

1. ముఖ్యార్థప్రతిపాదనంబె 2. నిధానభూతా !

దన్ముఖంబుననె ప్రవచనంబు చేయించక, కురుకేశమిశ్రముఖంబునఁ జేయించుట యేమి? వేద్యుండె వేత్త యగునె? యని, వేద్య వేత్తలకు భేదంబుఁ జూపు చందంబున వేత్రగ్రేసరుండైన శఠారియె యితండని కాఁబోలు! కాకయున్న నతని చేతనె ద్రవిడోపనిషద్భాష్యంబుఁ జేయింతువె? శ్రీభాష్యంబు చేసిన నీవె చేయరాదె? ఇంతమాత్రమె కాక, మొదలనె యతని శఠారిత్వంబు కురుకేశవామంబిడి నీవె[1] ప్రకాశంబుఁ జేసినావు. ఇవ్విధంబున వేత్రగ్రేసరసమ్మతంబు న్నయ్యెఁ గనుక, భవత్ప్రణీత భాష్యసన్నిధిని వేద్యవేతృ భావ విరుద్ధాన్యకృతభాష్యంబులెల్ల వివశితంబులై నిరాకరింపంబడె. కురుకాధినాథవిరచితద్రావిడవేదభాష్యంబునుం దన్ముఖంబుననె ప్రవచనంబు చేయించక, శ్రీవత్స చిహ్నముఖంబునఁజేయించుటయేమి? అది వేద్యహృదయప్రియతమంబెయనితెలుపవలసి కాఁబోలు! ఇటువలెమీదివ్యచేష్టితంబులన్ని యుంగారణగర్భంబులెగనుక, తత్కార్యపరామర్శ విమర్శకాస్తికాగ్రేసర మేయంబు లితరులక మేయంబులుగదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖ

## 20

భగవదేకవేద్యస్వరూపా! తొల్లి నీవు లక్ష్మణ రూపంబుతో రాముని యందు సర్వదేశ, సర్వకాల, సర్వావస్థోచిత సర్వప్రకార శేషవృత్తులు న్నెడఁ బాయక చేసి మెప్పించితివి. అది నీకు సహజ విద్య. రాముడు కృత ప్రతికృత ప్రక్రియ నపేక్షించి, తానును నీయందట్లచేసి నిన్ను మెప్పింతునని పదునొకండువేల యేండ్లుంగాచి. [2]చేయలేక, యనుజ భావంబుననె కాని, అగ్రజత్వంబున నెట్లు సేయ గూడునని, ఆ యవతారంబునఁ జేయనివాఁడై, అవతారాంతరంబులనైనఁ జేయక విడువనని, వసుదేవ కులంబునందు దేవకీగర్భంబున నవతరించు సమయంబున రామనామంబుతో ని న్నగ్రజుంగమ్మని, గర్భసంకర్షణ వ్యాజంబున భిన్నోదరత్వంబుం గలుగునట్లు తా ననుజుండై జన్మించి, క్రమముగా మఱి ద్వాపరయుగాంత పర్యంతముం జూచియుం జేయలేక, యీ శేషత్వనిష్ఠ మంత్రరాజాష్టాక్షరీ ప్రభృతిభూత ప్రణవార్థరహస్య మర్మంబైనయప్పుడు ఉపదేశముఖంబున లభించక, స్వతస్సర్వజ్ఞత్వంబుల

---

1. ప్రకటముం జేసినావు.
2. (ఉ) నిన్ను మెప్పించ లేక, అనుజభావంబుననెకాని,

స్వతంత్రుండై సేయఁ గూడునె? యని తెలిసి, బదరియందు మున్ను శిష్యవృత్తి జూపుటకై తానె తనకు శిష్యుండైన కొఱఁత దీఱ, నీ యుగంబున శ్రీవత్సాంకమిశ్రుండై శిష్యభావంబొందిన యప్పుడు నీవు మాసోపవాసనియమనాది విధుల బరీక్షించి యుపదేశింపఁగాఁ దెలిసి, నీవు త్రేతాయుగంబునఁ దనయందు శేషవృత్తి చేసి మెప్పించిన భంగినిఁ దానున్ను నీయందు విషయాంతరంబుల నెఱుంగ సర్వప్రకారకైంకర్యంబులను జేసి మెప్పించె. ఈ శ్రీవత్సాంకమిశ్రుల రామత్వం సత్సంప్రదాయజ్ఞ సర్వపూర్వగుర్వభిప్రాయ నిశ్చితంబని పరంపరాశ్రుతమౌటచే నైతిహ్య సిద్ధంబు. కులదైవతంబగు రంగనాథుని చిరవిరచిత పరిచర్యల బరితోషింపఁజేసిన విశేషంబున నాడు యమళపుత్రులం బడసిన చందంబున నేడున్ను తత్ప్రసాదంబున యమళపుత్రులం బడయుటచేతఁ బ్రత్యక్ష సిద్ధంబు తద్వంశ్యులెల్ల రాజలక్షణలక్షితులై వర్తించుటచేత ననుమానసిద్ధముం గదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 21

అఖిలలోకైకపూజ్యా! అగస్త్యాశ్రమంబగు తిరుక్కురుంగుడియందు బూర్ణాభిధానుండైన హరి 'తానెన్ని యవతారంబు లెత్తియు నొక్క చేతనుఁడు న్నుముఖుండు గాఁడు; నీ కీ లోకంబెల్ల నభిముఖంబైన యుపాయంబేమి? తెలుపవె యని మిమ్ము సింహాసనాసీనులం గావించి, తా దిగువనుండి, మీ రుపదేశింపఁ ద్వయంబధికరించి మీపేరు ధరించెనఁట! మంత్రరత్నం బధికరించు మర్యాదయు న దదనంతరంబ తదధికారి కర్తవ్య కృతజ్ఞతాపూర్వక దాస్యానువర్తనంబును తా యాచరించి చూపి, భవత్ప్రణీతభాష్యంబు తనకు నత్యంత స్పృహణీయం యున్నదని, తద్గ్రంథగురుత్వ, సత్యత్వ, సరసత్వంబులనుం బ్రకాశింపఁ జేం తలంపున, మీ రుపన్యసింపఁగా శ్రీభాష్యశ్రవణముం జేసెఁ గావున, మీ మహిమా శయంబుఁ దెలియ సర్వేశ్వరుండె నేర్చుఁగాని, యితరులు నేర్తురఁటే! శేషన రాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 22

విజయశీలా! మీరు దిగ్విజయంబు చేయుకొఱకు భూప్రదక్షిణం బా రించుచు, శారదాపీఠంబునకు విజయంబుచేసి, తత్రత్య రాజసభయందు వేదా

సంగ్రహం బుపన్యాసంబుచేయఁగా, నచటి మహాతార్కికులయిన మిశ్రులందఱును మీతో వాదించలేక పరాజయంబునొందియు, 'శారద సన్నిధానంబున మీకృతి నిల్పి యంగీకరింపఁ జేసినప్పుడుగదా, మీరు జయించుటకు గుఱుతని, వదావదులై కవిసిన, 'నది మంచిదే' యని మీరు నటువలెఁ జేసినప్పుడు, మీకృతి శారద శిరసా వహించెనఁట! తత్కృత్యం బందఱుం గని యాశ్చర్యంబు నొందిరఁట! అది యాశ్చర్యమా? బ్రహ్మపత్నియగు శారద జగజ్జనకుండైన కమలనాభునకుఁ బెద్ద కోడలు. తనకతఁడు మామగారు గనుకఁ, దత్పారమ్య ప్రతిపాదక గ్రంథంబు శిరసావహించుటయుఁ, దద్వక్తయగు మిమ్ము సత్కరించుటయు న్నత్యంతోచితమె కదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా !

## 23

శ్రీవేశ్వరభేదసమర్థనా! యజ్ఞమూర్తినామంబుగల యాంధ్ర దేశీయుండైన యేకదండి అద్వైతసమర్థనంబుఁ జేయుచు న్నానాదేశంబులుం దిరిగితిరిగి బహుశిష్య సంఘంబులతో శ్రీరంగంబునకు వచ్చి, మీతో వాదం బపేక్షించిన, నష్టాదశవాస రావధి పరిక్లుప్త వాదంబున జయాపజయంబులు స్వాత్మైక సంవేద్యంబులె యని నిశ్చయించుకొని వాదించుచోటఁ, బ్రత్యహంబును బదునాఱు దినంబులు జయాప జయంబులు కనుపించక, సప్తదశవాసరంబున బ్రహ్మవేత్త బ్రహ్మమె యౌనని శ్రుతి నుడివి, యద్వైతంబె సమర్థించఁగా, నాడు వార్తాషట్కముఖంబున భేదమె సిద్ధాంతంబని యానతిచ్చిన పేరరుళాళరుకు విన్నపంబుఁజేసిన, అద్దేవుండు స్వప్న 1సాక్షాత్కారంబై 'నీకు దొడ్డ శిష్యునిఁ గలుగఁ జేయఁ దలంచి యే నిటువలెఁ జేసితి; నిఁక *"ప్రణవో ధనుః" అనెడి శ్రుతి నుపన్యసించి గెలువు'మనిన, మేల్కని కూరనాథప్రముఖుల కానతిచ్చి, ప్రసన్నమానసంబున యథాపూర్వకంబుగా

---

1 (ఉ) సాక్షాత్కారుండై

* ప్రణవో ధనుః శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవత్తన్మయో భవేత్॥

ఈ శ్రుతి ముండకోపనిషత్తు (2-2-4), ధ్యానబిందూపనిషత్తు(14) లలో గలదు.

సభామంటపంబున వసియించి, సర్వోపాధి వినిర్ముక్త సాయుజ్యరూప సర్వోత్తమ ముక్తిదర్శన భేదసమర్థన శ్రుతుల కవిరోధంబుగాఁ [1]బూర్వ దివసోపన్యస్తాద్వైత ద్యోతకశ్రుతుల కన్నింటికి నైకకంఠ్యంబుఁ జేసి, భేదంబె యుపపాదించినం జూచి, నిరుత్తరుండై సమ్మతించి, హర్షించి, శిష్యభావం బపేక్షించినఁ, బునరుప నయన పూర్వకంబుగా నతనిఁ బంచసంస్కారసంపన్నునిం జేసి, దయాపాలవరద రామానుజనామంబునఁ ద్రిదండినింజేసిన, నతండు 'జ్ఞానసార, ప్రమేయసారంబు' లను రెండు ప్రబంధంబు లొనర్చి, సన్నిధి నుంచి' యత్యంత పారతంత్ర్యంబు నొంది సర్వపూజ్యుండయ్యెనఁట! ఎందుఁ జూచినను నిన్ను మించిన తత్త్వదర్శి గలుగునా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 24

శ్రీకాంచీపూర్ణనిరతా! మీ రడిగిన తత్త్వ, దర్శన, మోక్ష, తదుపాయ, గురుచర, కాంతిసమ్మరణ నిమిత్తంబులైన యర్థంబులు వరదుం డానతిచ్చిన ప్రకారంబునఁ దిరుక్కచ్చినంబి తెలుపఁగా, మీరు దెలిసితిరఁట! ఇందుచేత నీవార్తా షట్కంబు భగవన్ముఖ నిశ్చితంబయ్యెఁ గనుక, సత్యంబనుటయును, అర్చా రూపంబునందు భగవచ్చైతన్యంబింత పరిపూర్ణంబనుటయును, దాస్యైకజ్ఞానానుగుణ వ్యవసాయ ప్రేమవంతులకే యది ప్రత్యక్షంబనుటయును, ప్రత్యక్షీతాత్మనాథుఁ డీ తిరుక్కచ్చినంబి యనుటయును, అతం డనవరతంబు వరదునితో నేకాంత సమయసంభాషణంబుఁజేసె ననుటయును,వారిరువురికిని మీరాప్తతములనుటయునుం గా నివి యొక ఆలర్థములు నీవలననే బయలయ్యె. ఈ చాతుర్యం బార్యుల కాశ్చర్యసంపాదకంబయ్యెఁ గదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 25

వరదప్రియతమా? యాదవప్రకాశుని మాత తనకు స్వప్నంబైన కర పుత్త్రినకుఁ 'త్రిదండసన్న్యాసంబుఁ జేయు'మని విధించిన, నతండు 'శిఖాయజ్ఞోపవీత పరిత్యాగప్రాయశ్చిత్తంబుగా భూప్రదక్షిణం బాచరింపవలెఁ; నింత ఆయాసంబున కోప. వరదరాజస్వామి నియమించినట్లు చేసెద'ననిన నద్దేవుండుం బేరరుళాళ

1 (ఉ) పూర్వపూర్వ దివసోపన్యస్తాద్వైత—

రను పేరు సార్థకంబుచేసికొనుట కిదియె సమయం బనియెడువానివలె, 'మా రామానుజుల కొకమా ప్రదక్షిణంబుచేసి నమస్కరించినం జాలు; నీకు భూప్రదక్షిణంబు చేసిన ఫలంబు సమకూరు'నని యానతిచ్చి నీ మహిమ విదితంబు చేసెనఁట! నీవు భూమిఁదల కెత్తుకొన్న శేషుండవె గనుకఁ, 1దత్ప్రదక్షిణ ఫలము నొసంగఁగల; విది యాశ్చర్యమా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజ శేఖరా!

## 26

విశిష్టాద్వైతనిర్వాహకా! నాథ యామున నిర్ణీతసిద్ధాంతానుసారిగా మీరు వేదాంతం బుపన్యాసంబుచేసి, తనపక్షంబుఁ బూర్వపక్షంబు చేసినం గని, యాదవ ప్రకాశయతి వరదరాజ నియమనముఁ గైకొని, యంతేవాసి భావంబునొందినఁ, బున రుపనయన పూర్వకంబుగాఁ దాపాది పంచసంస్కార2 సంస్కృతునింజేసి, గోవింద జీయరను దాస్య నామంబునఁ ద్రిదండసంన్యాసం బన్వయింపించి, యతనిచేతనే 'యతిధర్మసముచ్చయం'బను గ్రంథంబుఁ జేయించితిరఁట! మీ వేదాంత వేదిత్వంబును. వేదమార్గ ప్రతిష్ఠాపకత్వంబును ధరాతలంబునఁ బ్రథితంబయ్యెనహో! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 27

వకుళాభరణప్రకటీకృత ప్రభావా! యోగిజనాగ్రగణ్యుండైన శ్రీమన్నాథ మునివర్యుండు మధురకవిప్రణీత శఠారివిషయప్రబంధంబు పంద్రెండువేలమార్లు జపంబుచేసినఁ, గురుకానగరాధిదేవత యగు ఆళ్వారు సాక్షాత్కరించి, తదభిమతంబు దెలిపి, ద్రవిడాగమజాతంబర్థపూర్వకంబుగానుపదేశింపుచుఁదత్కాలంబునకుభావియగు 3భవద్దివ్యావతారంబుఁ బ్రశంసించి, త్రిదండశిఖోపవీతధారణాంజలిముద్రాద్యుపశోభిత, బగు విగ్రహంబు ననుగ్రహించి, 'యీ మహాత్ముండు సుమీ! మనకందఱికి ముక్తిమూల'ంబని యానతిచ్చెనన్నను, నీ గురుత్వం బియత్తావచ్చిన్నంబన నెవనికి వశమే? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 భూప్రదక్షిణఫలంబు నొసంగఁగల; 2 సంపన్నునిం జేసి.

3 (ఉ)భవదీయావతారంబు

## 28

కమలాకాంత[1]మనోరథానురోధా! కారినందనచరణా! కాంచిపూర్ణప్రవణా[2]! యామునాచార్య కరుణా కటాక్షపరిపూర్ణా! పూర్ణాచార్య చరణ సమాశ్రయా! గోష్ఠిపూర్ణవశంవదా! కూరేశప్రియా! కురుకాధినాథ చంద్రసాగరా! పాదచ్ఛాయాభూత గోవిందవంద్యా! [2]పాదుకాకార దాశరథిసంసేవ్యా! ఆంధ్రపూర్ణ పరబ్రహ్మా! అనిరుద్ధనుర్దాస దయితా! రంగామృతకవిస్తుతా! రమ్య జామాతృమౌనిమానస నివాసా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 29

శఠకోపచరణరూపా! చతుర్విధయుగ వర్ణంబులందుఁ గ్రమంబున స్వతంత్రుండైన భగవంతుం డకర్మవశ్య నిరంకుశ నిజేచ్ఛ నవతరించుచుఁ, దుర్యంబైన యీ యుగంబునందు నట్లవతరించి, ద్రావిడబ్రహ్మసంహితా ప్రదర్శకుండైనఁ, దత్ప్రవచనంబుఁ దదర్థపూర్వకంబుగా బహుముఖంబుల నీవె యొనరింపం జూచి, తత్త్వజ్ఞులెల్ల భగవదభిప్రాయానుగుణ కార్యనిర్వహణ స్వభావుండగు విష్వక్సేనుండె యితండని, వేత్రంబె త్రిదండంబని నిశ్చయించిరి. ఇందుకు సందేహంబేమి యున్నది? నీవు విష్వక్సేనావతారంబని పద్మప్రతిపాదితంబౌట వృద్ధ పాద్మంబునందు విదితమే కదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 30

ఆద్యదేశిక ఛందానువర్తీ! నమ్మాళ్వారు తమ చరమ ప్రబంధంబులో త్రయోవింశదశకమం దాద్యగాథయం *'దనవరత కైంకర్యంబుఁ జేయవలయుం దాము తిరువేంగళముడయాను,' కని తలంచి వెళ్లనాడిన వచనం బనుష్ఠానపర్యవసానంబు చేయుటకు మీరు తిరుమల మీఁది కనంతాళ్వాను నంపించిన, నతండచటఁ బద్మాకరనిర్మాణంబుఁజేసి, తజ్జలసేకవర్ధితంబుగా నొక తిరునందన వనంబునుం గల్పించి, తత్సమానీత తులసీపుష్పసంచయంబుచేతఁ ద్రికాలంబులం దిరు[3]మాలెలు గట్టి యిచ్చి చాతించెనఁట! ఈ చర్య విచారించిన, మీ రాళ్వారికిఁ గరణభూతత

1 (ఉ)మనోరథానుమోద!

2 పాదుకీభూతదాశరథి-

* 'ఒషివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని'—అను పాశురము.

చూ. తిరువాయ్మొళి. 3వశతకము, 3వ దశకము, 1వ పాశురము.

3 మాలలుగట్టి యర్పించేనఁట!

లయిన కరణి [1]ననంతాళ్వారు మీకుఁ గరణవ త్పరతంత్రుండౌట[2]చేతఁ జేపి నట్లుండె; నౌర! భళి! శేషనగరాధినాథ! రామానుజ! నమోనమో యతిరాజశేఖరా!

## 31

విచిత్రచరిత్రా! చిత్రకూటనివాసియైన గోవిందరాజులు చోళోపద్రవ వ్యాజంబున స్థలంబు విడిచివచ్చిన, నతనిఁ దిరుపతిలోఁ బ్రతిష్ఠచేయుట కక్కడి వైఖానస పాంచరాత్రులతో మైత్రిచేసి, సమర్థించితివఁట! అతనికిఁ జోళకృతోప ద్రవంబు నివారించుకొనుమాత్రంబు శక్తి లేకయుండెనే? అందుకేమి; యా భావంబు నే నెఱుంగుదు. తాను కులశేఖరసూరికిఁ బరవశుండై, తదనుసంధా నానుగుణంబుగా రామస్వరూపంబగుటయును, నీవు లక్ష్మణావతారంబగుటయు—ఈ రెండున్ను ప్రకటంబుఁజేయఁదలంచి వచ్చెఁగాఁబోలు! ఇది తత్త్వంబె కాక యుండిన, దశరథ కులంబున నవతరించిననాఁడు వనవాస సమయంబున *"స్వయంతు రుచిరే దేశే క్రియతామితి మాం వద" అని నీవు ప్రార్థింపఁగా, నటువలెనే నియమించి, పర్ణశాలా నిర్మాణరూప కైంకర్యంబుగైకొనిన యలవాటు చేతఁ దానె వచ్చి నీ చేత కోవెల గట్టించుకొని నిలిచి సుఖించు కారణంబేమి? అనతియ్యవే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 32

మంత్రరత్న వివరణ విచారచతురా! (ప్రాచేతసుండు) తొల్లి పితామ హానుజ్ఞను దత్పుత్త్రిసంకాశంబున సంక్షేపంబుగా శ్రీరామాయణమూలంబు విని, దైవచోదిత వచనంబులఁదా నది విస్తారంబు చేసె. దీని యర్థంబు పితామహునకుం దెలియదు. ప్రపితామహునకుం దెలియదు. పితామహపితామహునకె కాని; అతనివలె నీవాక్యంబుల కిరువదినాలుగేసి యర్థంబులు[3]ప్రతిపాదింప నెవ్వఁడోపు? తత్సన్నిధి నధికరించి దీని యర్థంబు మండలంబున విస్తరింపఁ జేతుననియెడి తలంపునఁ బ్రాచేతసుండే రూపంబు గైకొని వచ్చెఁగా బోలు! కాకయున్న నితనికి రామావతారత్వ[4]ప్రసిద్ధి నొందిన శ్రీ వత్సాంకమిశ్రుల యమళ పుత్రులం దాను నామకరణాది సంస్కృతులఁగాఁ జేసి పోషించు మరులేల వచ్చు? తద్వాసన జన్మాంత

---

1 (ఉ) ననంతాళ్వారు; 2 (ఉ) తేట చేసినట్లుండె;

*మూ. శ్రీమద్రామాయణము. అరణ్యకాండము, 14వ సర్గ, 7వ శ్లోకము. (బరోడా ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ వారి ప్రచురణ—1963.)

3 ప్రసాధింప—; (ఉ) ఉపపాదింప—; 4 ప్రశస్తినొందిన—

రంబునన్నైన విడువ శక్యము గానిదె కదా! యని నా చూపున మీచర్య పర్యాలోచన చేసి, మిమ్ము శ్రీవాల్మీకి భగవానునిఁగా నూహించినాఁడ, ఇది యపరాధంబుగా గణింపకుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 33

శ్రీశైలపూర్ణప్రియా! తిరుమలనంబిగారు మీకు శ్రీరామాయణార్థంబు ప్రసాదించి, స్వశిష్యుఁడైన యెంబారును ధారవోసియియ్యఁగాఁ, బరిగ్రహించి, మగుడి కోవెలకు విజయంబు సేయువేళ మార్గమందు ఎంబారు కాచార్య విశ్లేషంబునఁ జరణ, ముఖంబులు శోభించినం జూచి, మీ 'రాచార్యసన్నిధికే పొ'మ్మని నియోగించిన, నటువలెనే వచ్చిన యెంబారు రాక నంబిగారు విననవధరించి, సమక్షంబునకు రానియ్యక, 'అమ్ముడుఁ బోయిన పసరమునకు గసవు పెయువారుం గలరె?' యని, అశనము నిడక, తమమీది యాశ విడిపించు తలంపున వాకిట నుండఁగానే 'పొ'మ్మనిపించిన పిమ్మట, మిమ్మె చేరి, అన్యవిషయ విముఖుండై, మీకుఁ జరణచ్ఛాయ యగుచు వసించెనంట! ఇటువలెఁ బశుదృష్టాంతంబున నిరూపించుటచేత, శిష్యవస్తువు తనస్వామి తలంచినట్లు నడచి, తాదృశ స్వప్రవృత్తిని వెంటనె మఱచి, తదధీన జీవన, దాన, [1]విక్రయాది యోగ్యమై యుండవలెనని చూపిన చందమై యుండె. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 34

[2]ప్రముక్షులోకబాంధవా! కాలజ్ఞమహర్షి వచో ఘోషసూచితంబగు మీయచలాభ్యుదయంబునకుఁ బూర్వంబైన పరాంకుశారుణోదయంబుఁగని మేల్కని మధురకవి, నాథ, యామునాది సత్కర్మానుష్ఠాతలు శుచిరావంబునొంది, నీమూర్తి సందర్శనంబునకు ముందువెనుకగా నర్ఘ్యప్రదానంబు లాచరించిరి. నీవు ఉదయించిన మాత్రంబునఁ గలి కల్మషాంధకారంబు లెచటికో తొలంగె. సమస్త దివ్యదేశ ద్వారకవాటంబులు దెఱచి, యారాధనంబులు చేయందొడంగిరి. భట్టనాథ, పరకాలముఖ ముఖాంబుజంబులు వికసించె. నీవు విష్ణుపదంబాశ్రయించి ప్రకాశింప కొలందిని కుదృష్టిఘూకంబు లాకులాంతరంగంబుల జీకాకుపడి తలలు

---

1 విక్రియాది యోగ్యమై

2 (ఉ) ముముక్షులోక లోకబాంధవా!

చూపవెలచె. కపర్దిమతాది కర్దమ పల్వలంబులెల్ల శోషించె. నీవు ప్రపన్నగాయత్రీ జపం బాచరించువారికిఁ గర్మసాక్షివి. త్రయీమూర్తివి. నిన్నుపాసనఁ జేయువారికి భవరోగంబు లంటవంటవు సుమీ! మునిచక్రమిత్రా! గురుకుల హంసా! శేషనగ రాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 35

భవరోగవైద్యా! ప్రకృతి యనియెడు రోగంబు నన్నునాదినుండి యంటి, దాని గుణంబులు ప్రతిసమయంబునందును విషమించి, బహువికారంబులఁ బొడమించుచు, బలపి యనవరత తాపంబులఁ జూపుచు, న్నేఁటికి[1] స్వీడదు. దీనిచే బహుక్లేశంబు లనుభవింపుచున్న వాఁడను. దీని మానుప నీవేకాని, యీ లోకంబులో వైద్యులెవ్వరున్నోపరు. నేనైతే యగతికుండను; అకించనుండను. నీ కేమి యొసంగఁ గలను? నీదయా ధర్మంబున మీ వదన పూర్ణచంద్రోదయంబుతోఁ గారుణ్యగుణం బనుపానంబుగాఁబెట్టి, శ్రీపాద తీర్థామృతసిద్ధ రసౌషధం బొసంగి, [2]తళియ ప్రసాద స్వీకారరూప పథ్యక్రమంబున నిలిపి, విరజోదకంబున నారోగ్య స్నానంబుఁజేయించుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 36

[3]శ్రీరంగేశ దత్తైశ్వర్యాభిరామ! యామునాచార్య వియోగ కారణంబున భోగమంటపంబు చొరనొల్లని నీయలుకఁ దీర్చి రప్పించుకొనుటకు రంగనాయకులు తమవద్ది గాయకులఁ బంపించి, వేగవతీతీరవాసియైన త్యాగమంటపేశ్వరుండగు దేవరాజును గాన విద్యాముఖంబున మెప్పించి వినృతనిచేతఁ ద్యాగరూపంబుగా నందుకొని తెచ్చు తంత్రంబుచేపి, యటువలె నరుదెంచిన నిన్నెదుర్కొని యపార దయంగని, సకల సన్మానంబులుంజేసి, తానున్ను 'నీ వశమయినా' నవి తన యుభయవిభూతులు నీ్న చేతికిచ్చి, నిర్భరుండై వర్తించెనఁట! ఇటువంటి విశ్వాధి రాజ్యంబు గలవాఁడవు నీవు! నీ మంత్రులు నీ్నయంతవారలు! వారు నన్నభి మానించినారు. నే వారివాఁడనైనాను. ఇఁక నా కెదురెవ్వరె? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 విడువదు. 2 తళిహ ప్రసాద—; (ఉ) తళిఘ ప్రసాద—
3) ఉ) కరిగిరీశ దత్తైశ్వర్యాభిరామా!

## 37

గోష్ఠీపూర్ణవశంవదా! మీరు చరమశ్లోకార్థం బధికరించుటకుఁ గోవెలనుండి పంచయోజనపరిమాణదూరంబగు గోష్ఠీపురంబునకుం జని నంబిగారి సన్నిధిని స్వాభిప్రాయంబు విన్నపంబుఁజేసిన, అర్థగౌరవంబు న్నధికారి దౌర్లభ్యముం గనుపింపఁజేయవలసి, 'యిప్పుడు గూడదు, మగుడి ర'మ్మనుచు నివ్విధంబునఁ [1]బద్దెనిమిదిమార్లు నడువఁజేసి యరుదుపఱచి, బహువిధంబులఁబరీక్షించి యామీఁద నానతియ్యఁగా నధికరించితిరఁట! ఇంచుమించులేక పద్దెనిమిదిమార్లె నడువఁజేయుట పంచమవేదంబగు భారతంబు అష్టాదశపర్వాత్మకంబు. తత్సారభూత గీతోపనిష చ్ఛాస్త్రంబు నట్ల అష్టాదశాధ్యాయాత్మకంబు. తదుపరి [2]తన రహస్యంబది గావునఁ బర్వాధ్యాయసంఖ్యను నడిపించి యంతట నుపదేశింప వలెనను తలంపుననో యేమి? తెలుపవే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 38

బుద్ధాత్మకరక్షణ బద్ధకంకణా! నీవు సకల వేదవేదాంతాది శాస్త్రవేత్త వగుచుఁ బ్రమాణ పరతంత్రుండవయ్యును, బుద్ధిపూర్వకంబుగా గురువచనం బతిక్రమించి, తత్ఫలంబుగా దుర్గతి వచ్చిననైన రానిమ్మని సమ్మతించి. సంసారావర్తగర్తంబునం జిగులుకొని [3]పౌనఃపున్య జన్మమరణ నిరయ పతనరూప పరిభ్రమణంబులంగ్లేశింపుచున్న చేతనులం గటాక్షించి, యగ్గలంబుగాఁ బెకలివచ్చు దయ నాపలేక, ఆశించినఁజాలుఁగాని, యధికారి పూర్తి [4]లేకయున్న నుండ నిమ్మని అందఱికి మంత్రముపదేశించి ముక్తి యొసంగితివి. అనధికారుల కుపదేశించినఁ [5]దమకెక్కడ హాని వచ్చునో? యనియెడి స్వోజ్జీవన నిమిత్తలోభంబున వయ జనించక పూర్వులెవ్వరు న్నీవలె నుపదేశించలేకపోయిరి. తాదృశదయా గుణం బసాధారణంబుగా నీయందె కనిపించెఁగావున [6]నీవు సర్వోత్తారకుండ వైతివి. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 39

సర్వోత్తారకా! సంసారిచేతనోజ్జీవన కాముండగు సర్వేశ్వరుండు రామ కృష్ణాదిరూపంబుల నావిర్భవించి పరత్వప్రయుక్తాతిమానుష దివ్య చేష్టితంబులం గనిపింపఁజేయుచున్న, విభీషణ ధనంజయాది వ్యాజంబునఁ బ్రపత్త్యుపదేశముం

---

1 పదునెనిమిది మారులు 2 పరితరహస్యంబిది—

3 (ఉ)పునః పునర్జన్మ మరణానేకనిరయ పతనరూప— 4(ఉ) లేకయుండినా యుండ నిమ్మని 5 దమకేమిహాని— 6 నేకతంబున నీవు

జేసి, "[1]ప్రపన్న రక్షణంబు నావ్రత"మని దీక్షించి శరణావరణార్థులరాక నిరీక్షించు నప్పుడు,ఎవ్వరునువచ్చి వరించువారులేక నేపోవుటచేతఁ జేతనసంరక్షణముంగానేరక, వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్యాది గుణంబు లసత్కల్పంబులయ్యె. నీ వావిర్భవించి చేతనుల దుఃఖిత్వాజ్ఞత్వ కుటిలత్వాదులఁ గన్నవాఁడవై, వారలయ్యె వచ్చి వరించపలెనని యెదురుచూడక, వారల నీవే స్వకీయత్వేన వరించిన పరమ దయాళుండవైన చతురుండవు గమక చేతన జాతంబునకు మోక్షముం ఘటించె పూర్వోక్తగుణంబులకు సత్తయుం గనిపించె. అనితర సాధారణత్వోపాయాత కాచార్యత్వము నీయందె నియతమయ్యె. ఈ పరగతవరణంబు స్వగతవరణము వలెఁగాక ప్రబలమై యమోఘంబౌట నీవు రామానుజుండవై యున్న కాలంబున వేద్యుండైన మీయన్నవలననే శ్రీగుహాదివృత్తాంబులయందుఁ గన్నావు. *"నాయమాత్మే" త్యాది ఫణితిచేత వర్ణించి యాశించిన వేదపురుషునియందు విన్నావు. పితామహునివలనఁ బరమాచార్యులు లభించిన చందంబునఁ బరమాచార్య ప్రథమాచార్యులవలన నీవు లభించియున్నావు గావున వేద్యవేత్తల కీ పరగతస్వీకారమందె తాత్పర్యమని తెలిసె; నౌరా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 40

లక్ష్మణాఖ్యదేశికమణీ! నీవు ద్వితీయ వర్ణమందు దశరథ కులంబున రామానుజుండవై [2]యుండునప్పుడు ధనుర్వేదాధ్యయనంబుచేసి, ఆరురుక్షు దశను చాక్షుషలక్ష్యంబు లంటనేసితివి. నే డగ్రవర్ణోత్పన్నుండవయ్యును తజ్జన్మాంతర సంస్కార విశేషవశంబునఁ దత్పర్యాయ విద్యయందన్వయించి, ఆరూఢ దశ నొంది. ప్రణవ [3]కోదండంబు ప్రపత్తిగుణసమేతంబుచేసి, యందు భరతఖండాక్షయ తూణీరస్థ బద్ధాత్మశరంబులం దివిచి తివిచి తొడిగి తొడిగి ప్రతివేళలందును సప్త లోక బ్రహ్మాండ కటాహ సప్తావరణంబులనుం [4]గాడిపాటి, తట్టున సూటి దప్పక

---

1 (ఉ) ప్రపన్న జన రక్షణంబు

* నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।
యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥

ఈ శ్రుతి కఠోపనిషత్తు (2-23), ముండకోపనిషత్తు (2-3)లలో గలదు.

2 యవతరించినప్పుడు 3 (ఉ) కోదండదండంబు 4 గాడిపాఱేటట్లు సూటిదప్పక

నచాక్షుష పరమాకాశ భాసమాన పరబ్రహ్మ లక్ష్యంబున న్నాటుకొన [1]నేయం బట్టితివి. ఈ చాతుర్యం బెన్నడును గన్నది విన్నదింగాదు. హరిహరబ్రహ్మాదు లకు న్నవాఙ్మానసగోచర మహో! శేషనగరాధినాథః రామానుజః నమో నమో యతిరాజశేఖరా!

## 41

వామనతుల్యశీలా! అతిమందగతుల నలయుచుంబోయి, పసరాకులె మెసంగిపడియుండు కీటకంబులం బట్టితెచ్చి, తనరూపం బమరంజేసి, యంబరతల విహరణంబునుం గుసుమరసపాననైపుణీ పాటవంబునుం గఱపు తేంటి చందంబున, లీలావిభూతియం దనవరత జన్మమరణ పరంపరల నలయుచు న్నతిహేయ విషయ [2]లోలాళ నధోలోకంబునం బడి కీటజన్మంబులొంది దుర్గతులం బొందుచున్న అస్మదాద్యతి నికృష్ట చేతనులం బరిగ్రహించి, యందఱికి న్నపేక్షా విరపేక్షంబుగ నర్చిరాదిమార్గమున విహారంబును, విరించి త్రిలోచన సనక సనందనాది మహాయోగివర్యాగ్రగణ్య మానసంబులకు [3]న్నత్యంతదూరంబగు భగవదంతరంగ పరిచర్యాచరణయోగ్యాధికారంబునుం గరుణించితివి, నీ కరణీ నకారణ మహోపకారకు లుభయవిభూతులందు వెదకినం గలరంటే? శేషనగరాధి నాథః రామానుజః నమో నమో యతిరాజశేఖరా!

## 42

మోక్షఫలసంధాయకా! నీ వప్రాకృత కల్పవృక్షంబవు. నీ కావిర్భావ స్థానంబైన యాలవాలంబు ప్రణవంబు. తత్రత్య మధ్యమాక్షరంబు క్షేత్రంబు. ప్రథమాక్షరంబు బీజంబు. ఆత్మవర్గప్రాప్తినిమిత్త భగవత్సంకల్పంబు దకసేచనంబు. అంకురభావంబు లుప్తచతుర్థి. వ్యక్తభావంబు చరమాక్షరంబు. గూఢపాదపత్వంబు మూలమంత్రంబు. అధిగమించిన శాఖలు ఋగ్యజుస్సామాథర్వణంబులు. ఉప శాఖలు తత్తద్గత భేదంబులు. బ్రహ్మసూత్రంబులు పల్లవంబులు. విషయ వాక్యంబులు పర్ణంబులు. సార,సంగ్రహ, దీప, భాష్యాది గ్రంథావిర్భూతి [4]పూంచుట. భక్తి పరిమళంబు. ప్రపత్తి మకరందంబు. ముముక్షుత్వంబు కాచుట. శలాటు భావంబుననె రాలుట ఆత్మానుభవమాత్రప్రదకైవల్యపదపతనంబు. పరమ పదప్రాప్తి కామితఫలభావంబు. తదవసర సముద్భూత వాసన [5] తన్నిమిత్తాతి శయార్తి. గుణానుభవమాత్ర పర్యవసితాధికారం బామ్లరసప్రధానమధుర విధురా

---

1 వేటంబెట్టితివి. 2 (ఉ) లాలస 3 న్నత్యం తాశ్చర్యరూపంబగు
4 పుష్పగుచ్ఛంబు. 5 (ఉ) తన్నిమిత్తాతిశయితార్తి.

పేక్స్వభావంబు. తద్విలక్షణ పరిపక్వభావంబు కైంకర్య పర్యంతాధికారంబు. భగవన్ముఖవికాసావహత్వంబు రసంబు. అందలి బీజం బనన్య భోగ్యత్వంబు. ఈ వృశామృతాత్మక ఫలప్రదాతృత్వంబు నీ స్వభావంబు. అయిన ఫలంబు లప్పుడప్పుడె చేర్చువారలు అర్చిరాది పురుషులు. భోక్తలు ఆది దంపతులు. నీ పరిసరంబునఁ గాచియున్న పాలకు లప్రాకృత 1భూసురులు గదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 43

శ్రీశరణ్యశరణ్యా! కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగ, ప్రవత్తి యోగ భేదంబులన మోక్షోపాయంబులు నాలుగని భగవన్ముఖోదితగీతా, పాంచరాత్రాదిశాస్త్రంబులు బోధింపుచున్నవి. ప్రథమగణితోపాయంబులు మూఁడున్ను పరస్పరాంగాంగి భావ నిబంధనంబులు. అందు జ్ఞానభక్తి సమన్విత కర్మయోగాధికారులు జనకాదులు. భక్తికర్మాన్విత జ్ఞానయోగాధికారులు భరతాదులు. ప్రకృష్టజ్ఞానకర్మసహకృత భక్తియోగాధికారులు ప్రహ్లాదాదులు. పూర్వోక్తోపాయ త్రితయ వ్యావృత్తి నివృత్తి ధర్మరూప సాంగప్రవృత్తి యోగాధికారివి నీవు. నీవే మోక్షోపాయంబని యున్న యధికారు లస్మద్దేశికులు. తన్నిర్హేతుకాంగీకారమె దాసునికి మోక్షోపాయమయ్యె. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 44

2బ్రహ్మజ్ఞవంద్యా! పరమపదప్రాప్తికి భక్తియోగం బుపాయంబంటివా, భక్తియోగం బాత్మావలోకనరూపయోగ సిద్ధ్యంతర తదుత్పాద్యంబు. తాదృశాత్మావలోకనంబు జ్ఞానయోగసాధ్యంబు. జ్ఞానయోగంబు కర్మయోగ విష్పాద్యంబు. కర్మయోగంబు సంధ్యావందనాద్యనుష్ఠాన పురస్సరంబు. సంధ్యావందనాదులు స్నాన పురస్సరంబులు. స్నానంబులు శౌచపురస్సరంబులు. * "శౌచమేవ కలౌ నాస్తి కుతోఽనుష్ఠాన సౌష్ఠవం" అనిన్ని, "కలౌ ఖలు కుత శ్శౌచ మశౌచః కిం। సమాచరేత్" అనిన్ని, మహర్షు లేకకంఠోక్తముగాఁ 'గలియుగమందు విధ్యుక్త శౌచమే లేదు; కర్మానుష్ఠానసౌష్ఠవం బెందువలనఁ గలుగు'?నని యాక్షేపించఁగాఁ

---

1 భూసురులఁట గదె! 2 (ఉ) బ్రహ్మజ్ఞానివంద్యా!

* ఈ సంస్కృతవాక్యములకు ఆకరములు లభింపవలసియున్నవి.

గర్మయోగమే లేకయుండుటంజేసి, తన్నిష్పాద్యజ్ఞానయోగంబు వార్తామాత్ర దూరంబగుచుఁ దదుభయసాధ్యాత్మావలోకనంబు శశ విషాణ కల్పంబయ్యె. తదనంతర తత్సాధ్య భక్తియోగాభావంబు కింపునర్న్యాయ సిద్ధంబయ్యెఁ గావున, భక్త్యవాంతరభేదభిన్న విద్యావిశేష ప్రతిపాదక భాష్యార్థం బనుష్ఠాన పర్యంత 1ప్రాప్తంబు గానేరక, యుపన్యాసమాత్ర చరితార్థంబై పరరంజనరూప ప్రయోజన పర్యవసానంబయ్యె. ఏవంరూపంబగు దుష్కరభక్తియోగం బవలంబించిన నెటువలె మోక్షంబబ్బు? అబ్బదు గనుకనే *"త్వత్పాదాంబుజ ద్వయప్రపత్తే రన్యం న మే కల్పకోటి సహస్రేణాపి సాధనమస్తి" అని నిశ్చయించి తృతీయోపాయంబు విడిచి, వరదోపదేశ ప్రకారంబున మీరుం దుర్వ్యోపాయంబు విధించవలసెఁ గదె! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 45

పూర్ణప్రజ్ఞోపాయభూతా! గద్యోక్తభగవత్ప్రపత్తి మోక్షోపాయంబని యంటిమా, అది స్వగతస్వీకారరూపంబై, యెప్పుడు స్వరక్షణె స్వాన్వయంబౌటం జేసి యహంకార గర్భంబై, భగవదత్యంత పరతంత్రస్వరూపంబునకుఁ జేరక, భీతి జనకంబగుచు దుఃఖవర్ధకమై తోఁచి, చరమరహస్య చరమపదవై యర్థ్య పిశునంబై నైర్భర్య సంపాదకంబు గానేరదయ్యె. కావున స్వరూపయాథాత్మ్య పర్యంత జ్ఞాన రహితులగు తావన్మాత్ర జ్ఞానవంతులకే యుపాయంబై 2ఆచ్ఛాదింపుచున్న ఉపచ్ఛందన మాత్ర పర్యవసితంబయ్యె. అటుగనుకనే విష్ణుచిత్తార్య శిష్యుండైన వాత్స్య వరదాచార్యుండు ఆత్మప్రయాణ కాలమందు హితంబడిగిన 3శ్రుతప్రకాశికాచార్య ప్రముఖులైన స్వశిష్యులు నలుగురికి స్వాతంత్ర్యమూలక స్వయత్న సాధ్యంబగు భక్తియోగముతో ప్రపత్తియోగమునుం గూర్చి సముచ్చయించి ఈ రెంటియందు మీకు స్వరూపవిరుద్ధత్వాది పర్యంత పరామర్శాయాత దుష్కరత్వంబు గనిపించెనేని ఇది విడిచి సర్వోపాయాతిరిక్త రామానుజ చరణ సమాశ్రయణంబు సేయుఁ డిది

1 (ఉ) ప్రాపకంబు

* ఈ వాక్యము భగవద్రామానుజ ప్రణీతమైన 'శ్రీ వైకుంఠగద్య యందలిది.

2 ఆభాపింపుచున్న 3 (ఉ) శ్రుతప్రకాశికాకార ప్రముఖులైన

పరమహితంబని విధించె. ఇందుచేత జ్ఞానపూర్ణులె నిన్నాశ్రయించువారలని [1]తెలిపె. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 46

అపవర్గమార్గదర్శీ! త్రిదండంబును ధరించి, యంజలిముద్రయుం జూపుచున్న మీ దివ్యాకారంబు సేవించనేర్చిన బుద్ధికుశలులకుఁ గనిపించు భావంబు నేఁ [2]దేటపడ విన్నవించెద. 'కర్మజ్ఞానసహకృత భక్తిద్వారంబునను ప్రపత్తియె మోక్షోపాయంబు. ఏతాదృశ భక్తి యోగంబునం దశక్తులైనవారికి భక్తియోగంబు వినాగాఁ బ్రపత్తియె స్వతంత్రోపాయంబు. ఈ యుభయ విధంబులును భాష్య, గద్యత్రయ ముఖంబుల నస్మదుక్తంబులే కదా! యథారుచి మీ రాచరింపు'డని చూపు చందమై యున్నది. భవదర్శితమార్గంబులం బట్టి. వెతకులాడక, భవదీయాభిమానంబున నొదిఁగి భవబంధములు సడలించుకొనువారు గదా భాగ్యవంతులు! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 47

ప్రపన్నజన కూటస్థా! భగవద్విషయమందు నీ వాచరించిన ప్రపదనరూపోపాయానుష్ఠానం బమోఘంబగుట గనుంగొని, పూర్వాపరదేశికులందఱు నీన్ని సంబంధం బన్వయించి ముక్తి లభించిరఁట! ఈ యర్థం *"బన్వయాదపి చైకస్య" +"సకృదేవ ప్రపన్నాయే" త్యాది వేదోపబృంహణ వచనంబులు ఘోషింపుచున్నవి. కనుక, నీవు పురాణప్రసిద్ధ మహాపురుషుండవని ప్రామాణికు లందఱుం దెలిపిరె! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 తెలిపెనె! 2 (ఉ) తేటపఱచి విన్నవించెద.

*"అన్వయాదపి చైకస్య" అను ఈ సంస్కృతోక్తికి ఆకరము లభింపవలసియున్నది.

+శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ॥
—శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, 18వ సర్గ, 33 శ్లో.

## 48

జ్ఞానినామగ్రేసరా! నీకు జనకుండు పరవాసుదేవుండు. జనని సంకర్షణామూర్తి. అన్న శ్రీరామచంద్రుండు. తమ్ముఁడు శ్రీకృష్ణుండు. అల్లుఁడలమేల్మంగాపతి. ఆత్మజుఁడు యదుశైలసదనుండు. దొర వరదరాజులు. దాత శ్రీరంగనాయ - చెలికాఁడు చిత్రకూటనివాసియైన గోవిందుండు. శిష్యుండు తిరుక్కురుంగుడి నంబి. ఆత్మబంధుం డళఘరు. ఆందోళికాది సంపద లనంతపద్మనాభుండు. శతాంగాది వాహనపంక్తి జగన్నాయకులు. ఇష్టదైవం బీ గోపాలస్వామి. ఆచార్యుండు నమ్మాళ్వారు. ఇవ్విధంబునఁ బరత్వాది వేషవిశిష్ట భగవానునియందే నీకు సకలవిధబంధు భావసంపదలు న్నమరెఁ గనుక, *"మాతాపితే"త్యాది శ్రుతి నిన్నే వర్ణించెనని కనిపించె సుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 49

సకలజీవజీవనస్వరూపా! మంత్రప్రతిపాద్య దైవప్రభావంబు పోలిక కామగదా మంత్రప్రభావంబు! అతండు దూరంబున నుండినను. తానుసమయంబున కొదవిన రక్షకంబగు. అదెట్లన్న, ద్రౌపది కాపత్సమయంబున వల్వ లొసంగినది మంత్రమె కాదె? బోయను వాల్మీకినిం జేసి తాదృశప్రభావసంపన్నునిఁగాఁ జేసినది మంత్రమెకాదె? అజామీళుని పాపంబులెల్ల దుల్లఁజేసి [1]ముక్తియొసంగినది మంత్రమె కాదె? క్షత్రబంధువు పాపంబులం బాపి ముక్తునిం జేసినది మంత్రమెకాదె? కావున నిన్నపేక్షించకనే నీకు వాచకంబైన మంత్రమే మాకు సంసార తారకంబగు. తత్సంసిద్ధిగలవారి చేతిలోవాఁడవే నీవున్న. ఏమిటివల్లనన్నను, +"మంత్రాధీనంతు దైవతం" అనియెడి ప్రమాణ బలంబున. ఇంత విస్తరించ నాకేమిటికి? నీకు వాచకంబైన మంత్రమె సకలలోకోత్తారకంబని బ్రహ్మవిదగ్రేసర శ్రీవత్సాంకమిశ్ర దేవరాజ [illegible]కులు ఘంటాఘోషంబుచేసి చాటంగా. శేషనగరాధినాథ! రామానుజ, నమో నమో యతిరాజశేఖరా!

---

*"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః"
ఈ వాక్యము సుబాలోపనిషత్తు నందలిది.

[1] (ఉ) ముక్తునిం జేసినది.

+శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్।
తన్మంత్రం బ్రాహ్మణాధీనం తస్మాద్బ్రాహ్మణ దైవతమ్॥
ఈ శ్లోకము విహగేంద్రసంహిత (పాంచరాత్ర సంహిత) లోనిది.

## 50

చరమపదోపాయ రూపా! 'చతుర్వింశ ద్వాదశాష్ట ద్వి త్రి కాక్షరమంత్ర విశేషార్థగోపనచాతుర్యంబు గలిగి, మీకు వాచకంబై, మోక్షైకహేతువైన యీ చతు రక్షరిని హస్తిగిరీశ్వరుండె ప్రకాశింపించక యుండెనేని, మాదృశ దేహధారు లెటు వంటి దురవస్థలం బొందుదురోకదా!' యని త్వద్వ్యతిరిక్త గత్యంతరాభావ నిమిత్త విషాదవిస్మయ దర్శకంబగు శ్రీవత్సాంకమిశ్రుల పద్యరూపసూక్తి తల్లాభప్రాప్త ప్రమోదనిర్భరత్వం బస్మదాదుల కనవధికంబుగా నొనర్చె సుమీ! శేషనగరాధినాథ రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 51

*చతుర చతురక్షరీ ప్రతిపాద్యా! భగవద్వాచకంబగు 'నారాయణే'తి శబ్దోక్తి యనియెడి చతురక్షరీ స్వరూపంబు విచారించి చూచిన, నైశ్వర్యకైవల్య భగవల్లాభాది ప్రదాయకంబౌట చేతం జతుర్ముఖ ప్రముఖ బుభుక్షుజీవ, సనక సనంద నాది జిజ్ఞాసుచేతన, పరాంకుశ పరకాల ప్రభృతి ముముక్షు జన సముదాయ సాధారణ జప్యంబు గనుక రాజసాద్యఖిలాధికారి సాధారణత్వాది దోష దుష్టంబు, నీకు వాచకంబైన 'రామానుజేత్యేషా' యనియెడి చతురక్షరీ స్వరూపంబు విచా రించిన, మోక్షైక ప్రదాయకంబు గనుక ముముక్షుజనైక జప్యంబై, ప్రయోజ నాంతర రహిత పరమసాత్త్విక జనాసాధారణత్వాకారంబునం బవిత్రతమంబై ప్రపన్నగాయత్రి యయ్యె. ఇది ముక్తప్రాయులైన చరమశరీరులకే సదుపదేశ మూలంబుగా లభించు. ఇతరులకు లభించునా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 52

గీతార్థప్రకాశకా! మునుపు ద్వాపరయుగమం దొక రామానుజుండు తన కొక నరుండు శిష్యుండై నిలిచినచోట సకలోపనిషద్రహస్య సారమర్మముం దేట

---

1 చరమోపాయ రూపా!

*ఈ వచనమునకు ప్రేరకమైన ప్రసిద్ధ శ్లోక మిది :

శ్లో॥ న చే ద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ ।

కా మవస్థాం ప్రపద్యంతే జంతవో హంత మాదృశః ॥

పఱచి యుపదేశించి యతనిని ముక్తిపథంబున నిల్పలేఁడయ్యె. నీ వతం డుపదేశించిన యర్థముసె కొని యసంఖ్యాత నరసమూహంబుల మోక్షపదంబున నిల్పితివి గావున, నతనికన్న నిన్నె చతురమతినిగా విద్వజ్జనులు విచారించిరి. ఏతాదృశ మహిమాతిశయంబుగల నిన్ను సన్నుతించ నేర్తునా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 53

భగవత్కైంకర్యలోలా! శ్రియఃపతి రామరూపంబైన యప్పుడు నీవు లక్ష్మణరూపంబున నతనియందుఁ జేయు శేషవృత్తుల కలరి, యువరాజపట్టంబునకు నియోగించినను, సమ్మతించక శేషవృత్తులే చేయు వాంఛ నినుమడించి నీవు సేయంగాఁ జూచి, యీ శేషత్వరసం బెటువలె నుండునో కనవలెనని, తథావిధ శేషవృత్తులు మగుడ నీయందుఁ దా నాచరింపఁ గాంక్షించి, యదువంశంబున నవతరించు తఱిని 'నీకు శేషత్వమేకాని, పారతంత్ర్యంబు వలదే'యని శిక్షించు చందంబున [1]రామనామ, జ్యేష్ఠ భావంబులు నిన్నుఁగైకొమ్మని యొడంబఱచి, తాను రామానుజ నామ, కనిష్ఠభావంబులం గైకొనియె. నీ వటువలెనె యవతరించిన వాఁడవు గనుక నీకుఁ బారతంత్ర్యంబునుం గలిగె. తా ననువర్తించి శేషవృత్తు లాచరించ నేరక నామమాత్రోపజీవి యగుచు, స్వతంత్రుండెయయి సీతావిశ్లేషజనిత క్లేశంబెల్లఁ దీర్చుకొనువానింబలె యథేష్టంబుగాఁ గామరసలో నుండయెఁగాని, శేషత్వరసలేశంబైన నెఱుంగఁడయ్యె. స్వతంత్రులున్ను, విషయప్రవణులున్ను శేషత్వరసం బెఱుంగుదురె? ఎఱుంగక కాని శేషత్వం బబ్బునె? ఎంత లేదు? అది నీకే యసాధారణ ధర్మంబు. నిన్నుఁ జూచి నేర్చుకొనేమన్న నీశ్వరునకైన నలవియగునా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 54

అప్రమేయస్వరూపా! నీ వాదిశేషుండవు. నీ యాకారంబు లనేకంబులు. అన్నియుం భగవద్భోగోపకరణంబులె. అందుఁ గొన్ని ముఖ్యంబులు. అవి విన్నవించెద: అష్టోత్తరశతస్థానాది సమస్త దివ్యదేశంబులం గల వేదశృంగానంద నిలయ పుణ్యకోట్యాది సంజ్ఞిక విమానరూప నివాసంబులు నీవ. తుంగవిమల

1 రామానుజ జ్యేష్ఠ భావంబు

విశాల శ్లక్ష్ణ తూల హంసతూలాది కల్పిత తల్పంబులు నీవ. మహార్ఘ్య మణిమయ ప్రధాన సింహాసనాది సమస్త దివ్యపీఠంబులు నీవ. నానావిధ విచిత్ర సూత్నరత్నమయ పాదుకాయుగళి నీవ. మణిశ్రేణీనద్ధ సముచిత తత్తన్మధ్య దేశ ప్రకాశమాన ముక్తావళీయుక్తాంచల పీతాంబరంబులు నీవ. నానాక్షౌమకృత నవోపధానంబులు నీవ. దివ్యాతపత్రపంక్తి విశేషంబులు నీవ. మణిమయ కరదీపికాది దీపపరంపర నీవ. ఇవ్విధంబున స్వచైతన్యంబు తోఁచకుండ నచేతన ప్రక్రియనుండు శేషవస్తుస్వరూపంబని చూపుచున్న సకలేతరవ్యావృత్త జ్ఞానానుష్ఠాన పరిపూర్ణుండవు గనుక *"జ్ఞానీత్వాత్మైవ మే మతం" ఇత్యుక్త మర్యాదను యథేష్ట శేషి వినియుజ్యమానత్వేన తదంతర్యామిత్వంబునుం జెందుచు భగవదంతరంగ బహిరంగంబుల నతిశయకరుండవై వెలుంగుచున్నవాఁడవు. నిన్నెవ్వరికిం దెలియ శక్యమే? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## ౫౫

[1]సర్వాతిశయాకారా! నీ యాథాత్మ్యంబు విచారించి చూచిన, శేషాత్మకుండవు గనుక చేతన పరమచేతనా విశేషంబున నందఱికిని శిరసావాహ్యుండవు. అదెట్లన్న [2]విన్నవించెద: భగవద్యామునేయ ప్రతిపాదితరీతినిఁ బరమపురుష పాదుకారూపావిర్భావంబు నొందియుండుదువు గావున, శ్రీభూనీళాది దివ్యమహిషీవర్గ శేషాశనాది నిత్యసూరి సంఘ, పరాంకుశ పరకాలాది దివ్యసూరినివహ, చతుర్ముఖ పంచముఖ షణ్ముఖ ప్రముఖాగ్నిముఖ సమూహ, సనక సనందనాది మౌనిసందోహ, ప్రహ్లాద నారద పరాశరాది పరమ భాగవతవ్రాత, నాథ యామున పూర్ణాది గురువరప్రకర, కూర కురుకేశాది ముముక్షుజనగణాస్మదాది సమస్త చేతన పర్యంతంబుగ శిరసావాహ్యుండవు. కౌస్తుభత్వాపన్న జీవస్వరూప ప్రతిపాదక మకారంబునకు ముఖ్యవాచకుండవౌటచేత నీవె మాణిక్యాది రూప తన్మయ కిరీటమకుటవేషం బమరి, భగవంతునకును శిరసావాహ్యుండవు. ఈ ప్రకారంబున సమానాధిక రహితుండ వహో! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

*భగవద్గీత VII—18.

1 (ఉ) సర్వాతిశయితాకారా! 2 (ఉ) వివరించెద.

## 56

[1]సర్వజ్ఞశిరోమణీ! విచారించి చూచిన, భగవత్పాదుకాకారంబునఁ బరిణ మించిన మహానుభావుండవు నీవు. తత్ప్రసిద్ధి తానందుకొని శఠకోపసూరి సమస్త దివ్యదేశంబులను వెలసె. ఇది మహావింతయైతె కొదువయేమి? మీ యిద్దఱికిం భేదమే లేదు కాఁబోలు! కలిగియుండిన నీకు నతనికి నన్యయవావయవి రూపైక్యంబేల సంఘటించు? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 57

భగవత్పాదుకాకారా! అపరాజిత సాకేతాఖ్యల నయోధ్యలు రెండు. ప్రథమాయోధ్యయందు. నీ యాధిరాజ్యంబు పరబ్రహ్మాధిరాజ్య పురస్సరంబు. ద్వితీయాయోధ్యయందు రామశబ్దాభిధేయ పరబ్రహ్మాధిరాజ్యంబు త్వదాధిరాజ్య పురస్సరంబు. అది త్వదాకారభేద పాదుకాగ్ర్యాభిషేకంబుననే సువ్యక్తంబు. ఏవంరూపోభయవిభూతినాయకత్వాధికారంబు నీయాకారంబున ననవద్యావ్యవధానంబైన కతంబున నిది పూర్ణావతారంబు. ఇందుకు నూటయెనిమిది తిరుపతుల యందు భగవద్భోగంబులు నీ యాజ్ఞాసిద్ధంబులౌటయును, ముముక్షువులకు మోక్షంబు నీ [2]యాజ్ఞా సిద్ధంబౌటయును సాక్షి. వివాదం బేలనే? శేషనగరాధినాథ: రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 58

ప్రణవ ప్రతిపాద్యా! కారణంబగు శేషి ప్రథమవర్ణార్థంబు. శేషత్వ [3]ప్రసిద్ధశేషవస్తువైన నీవు తృతీయ వర్ణార్థంబు. ఇవ్విధంబున మీ రిరువురుం ప్రథమ చరమవర్ణంబులం ప్రణవశరీరమందు నెలవుకొన్నవారలె. మీ రిరువురుం బురుషశబ్దవాచ్యులె. మీ రిరువురును సహస్ర శీర్షత్వాదిలక్షణ లక్షితులె. మీ రిరువురు నననంతాఖ్య గలవారలె. అయిననుఁ దత్కారణవస్తునిష్ఠశేషిత్వ నిరూపక శేషవస్తువు నీ వగుటచేతఁ దత్త్వదర్శిగణంబు నిన్నాదికారణంబని నిశ్చయించె. ఇందుకు సాక్షి నీ పేరట విష్ణు సిద్ధాంతంబు వెలయుటే సుమీ! శేష నగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 (ఉ) సర్వ సర్వజ్ఞ శిరోమణీ! 2 (ఉ) యనుజ్ఞా సిద్ధంబౌటయును
3 ప్రతిసంబంధి శేషవస్తువైన

## 59

శేషావతారా! నీ స్వరూపంబంటిమా, శేషత్వప్రతిసంబంధి రూపాది ద్వంద్వంబునకు శేషిత్వపూర్తిప్రద ప్రతియోగియై శేషసంజ్ఞిక ప్రసిద్ధి వహించు. నిజంబైన నీ రూపంబంటిమా, త్రిపాద్విభూతియందు అచింత్యాద్భుత దివ్యరత్న స్తంభసహస్రగంభీరమహానంద నిర్భరమహాప్రకాశమణిమయాస్థానమండపంబులోపల ధర్మాదినిర్మితరత్న పీఠోపరిప్రదేశ ప్రకాశమాన సహస్రదళపుండరీకమధ్యగస్వర్ణకర్ణి కాగ్రభాగంబున పరవాసుదేవ భద్ర పీఠాయమానం బగుచు, తదాధిరాజ్యపైశున్య ధన్యంబై ఫణాసహస్రంబుతోఁ బ్రవర్తించు. నీ జ్ఞానంబంటిమా, రమారమణ విహరణ సమయ సముచితాశేష శేషవృత్తు లన్వయించుటకుఁ దదాశయంబు యథావస్థితంబుగా సాక్షాత్కరింపించు. నీ బలం బంటిమా, దండాయమానాత్మ 1భోగాగ్రభాగ సంఘటితంబుఁ జేసి, మధ్య కీలిత మణిఖచిత శాతకుంభ కుంభాయ మాన బృందారకాలయా లంకృత సప్త సాగరాంతరోపరి సప్తనకులగ చక్రవాళ భేదభిన్నోత్తరోత్తర ప్రగుణిత ప్రదేశరేఖావలయ పరంపరా వలయిత సర్వ సర్వం సహాచక్రంబును వికచవిచిత్రాత2పత్రంబులీలను ధరింపించు. నీవిభూతులంటిమా, భోగ లీలార్థ విభూతిద్వయ నేతరాత్మ సంకల్పానుగుణానేక శరీరపరిగ్రాహివి నీవె యనుట చేత, నుభయవిభూతి పరిదృశ్యమాన రూపంబులన్నియు నీవైె కని పించు. ఏవంరూప స్వరూప రూపగుణబలవిభూతులు గల నిన్ను వర్ణించుటకుఁ దనకు శక్యమా? యని ఆత్మ విచారించు. వర్ణించకయుండ శక్యమా? యని జిహ్వ గమకించు. బుద్ధి యూహించు. మానసంబు సంకల్పించు. ఈ సంకల్పించు సాహసంబు నీవే సహించు! సహించు! కరుణించుమీ! శేషనగరాధినాథ! రామా నుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 60

అమితమహిమాకారా! శ్రీమదష్టాక్షర ప్రకాశకత్వంబున నరోపదేష్టయైన బదరీనారాయణునకు దక్షిణోత్తరభేదంబున నాశ్రమంబులు రెండు: ఇది యుత్తరంబు; దక్షిణాశ్రమంబు సహ్యజోత్తరభాగంబున సహ్యపర్వత పూర్వ కంబైన యాదవాచలంబు. అందుఁ జతుర్యుగంబులం దనకు శేషుండె శేష వృత్తిఁ జేయు వాంఛచేతఁ బ్రథమయుగంబునం దానే సహస్ర ఫణామండల మండి

---

1 (ఉ) భోగప్రభోగ సంభోగ సంఘటితంబు

2 (ఉ) పత్రంబులీల నుద్ధరించు.

తంబగు నిజాకారంబుతో వచ్చి, ద్వితీయ యుగంబున దశరథపుత్రుండై లక్ష్మణా కారంబున వచ్చి, తృతీయ యుగంబైన ద్వాపరంబున వసుదేవసూనుండై బలరామ రూపంబుతో వచ్చి సకలవిధ శేషవృత్తులుం జేసె. ఇఁక నీ తుర్యయుగంబున 'నొకఁడు కాఁగలిగి యున్నాఁ'డని యానతిచ్చిన *నారదీయ పురాణసిద్ధభగవద్వాక్యం బున కర్థంబు నీవే యనుట సువ్యక్తంబగునట్లు ఢిల్లీ నగరాధిపుండగు సుల్తాన్యవన ఖిలీకృత స్థలంబునఁ దదభిసంధి సమయ ప్రతిష్ఠితబుద్ధ ప్రతిమోద్ఘాటనంబు చేయించి మూలనారాయణ ప్రతిష్ఠాపనపూర్వకంబుగా గర్భగృహాంతరాళాది సకలమండప ప్రాకారగోపుర సరోవరారామాది నిర్మాణంబులనుం జేయించి, ఢిల్లీ నగరంబునకుం జని రామప్రియులం దోడి తెచ్చి, యథాపూర్వకంబుగా సకలోత్సవంబులను సంకల్పించితివిగనుక విద్వజ్జనులు మిమ్ము శేషావతారంబని నిశ్చయించిరి. మీరున్ను మీ శేషత్వంబు యాదవాచల మాహాత్మ్య వ్యాఖ్యాన సమయంబున దాశరథి ప్రముఖాంతరంగ శిష్యులకుఁ గంఠోక్తముగాఁ బ్రకాశంబు చేసితిరఁటగదే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 61

*రామచంద్రప్రియా! పంక్తిరథగర్భంబున జనియించిన భగవంతునకు నీ వనుజుండవై యున్ననాఁడు భరత శత్రుఘ్నులుం దదనుజులై యుండినను రామానుజత్వంబు నీయందె రూఢంబై నిలిచె. రాముండు జననీ జనక సాకేత నగర తదాధిరాజ్య తదుచిత భోగంబు లన్నియు న్విడిచి వనవాసంబుఁ జేయుచు, సీత విడిచిన వేళయందును నిన్ను విడువఁడయ్యె. కావునఁ దత్సత్తామూలంబు పూర్వోక్త జననీజనక ప్రముఖ సకల విషయంబులకన్న నీవే యని విదితంబయ్యె. అదికారణంబున సకలేతర విలక్షణ పరస్పరా పృథక్సిద్ధ భావంబుల వ్యక్తి

---

* నారదీయ పురాణమునందలి 'యాదవాద్రి మాహాత్మ్యము'నగల ఆ వాక్య మిది:

శ్లో॥ అనంతః ప్రథమం రూపం, లక్ష్మణస్తు తతః పరమ్ ।
బలభద్ర స్తృతీయ స్స్యాత్ కలౌ కశ్చి ద్భవిష్యతి॥
('కలౌ రామానుజ స్స్మృతః'
—అని పాఠాంతరము)

* ఈ వచనము కాగితపు ప్రతిలో 62వదిగా నున్నది.

భవించినవారు మీ రిరువురు న్నని కదా, వేదోపబృంహణంబును +"తరుణౌ రూపసంపన్నా" విత్యాది ప్రక్రియచేత వర్ణించె; నేమనవచ్చు? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 62

*అనంతావతారా! నీవు దాశరథివై యవతరించిననాఁడు మీ పెద్దన్న పితృవాక్య పరిపాలనార్థంబు వనవాసంబునకై [1]గమకించువేళఁ దత్సహధర్మ[2]చర్య యగు సీత తానుం గూడరాఁదలంచినంజూచి, నగరారణ్యవాసంబుల వాసిఁ దెలిపి 'వద్దు నిలువు' మనినఁ దనకుఁ దత్సంశ్లేష విశ్లేషంబులు స్వర్గ దుర్గతి కల్పంబులని సుఖదుఃఖరూపంబులుగాఁ బలికి, ఆయమ్మ తన యభిప్రాయంబు తేటపఱచి నగరంబున నిలువక వెంబడి దండకారణ్యంబున కరుగుదెంచనె నడచె. నీవుం గూడ రాఁగని 'పితృ నియమంబు లేని వనవాసంబు నీ కేల? నిలువు' మనిన 'మిమ్ము విశ్లేషించి [3]జలాదుద్ధృత మత్స్యంబు గతి ముహూర్తమాత్ర కాలంబుద కన్న మించి బ్రతుకఁ గలనె?' యని నీ యభిప్రాయంబు బయలుచేసి, [4]నిలువక వారి ననుసరించే నడచితివి. విచారించి చూచిన జనకజాధికారంబునకు నీ యధికారంబునకు న్నింత తారతమ్యంబున్నది. నడవళ్లు న్నడువుల కైవడివె. ఆయినా ఆ యమ విశ్లేషించి దుఃఖించిన మాత్రమెకాని, శరీరంబు నిలిపె. నీవు విశ్లేషావసరంబైనచోఁ దద్దేహంబు నిలుపలేవైతివి. అతఁడుం జానకీ విశ్లేషంబు సహించి యుండె. నీతో విశ్లేషంబున కోర్వలేఁడయ్యెఁ గావున, నీవే పిరాట్టికన్న నత్యంత ప్రియుండవైతివి గదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 63

ఖిలవినాశకా! నీవు సుమిత్రాపుత్రుండవై యుండునప్పుడు నీకు శరణుఁ జొచ్చిన సుగ్రీవుండు రామనిగ్రహంబు దప్పించుకొనెనఁట! వాయుబీజంబై బ్రహ్మ

---

+ శ్లో॥తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ మహాబలౌ।
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ॥

—శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, 19వ సర్గ, 14శ్లో.
(పరిమళ పబ్లికేషన్స్, ఢిల్లీ—1983)

* ఇది కాగితపు ప్రతిలో 61వ వచనముగా నున్నది.

1 (ఉ) గమనించు వేళ 2 (ఉ చరి యగు

3 జలాద్యుద్ధూత మత్స్యంబుగతి 4 (ఉ) విడువక

గాఁగలిగియున్న హనుమంతుం డానాఁడె నిన్ను రణరంగంబులోఁ దన స్కంధం బులపై నుంచుకొనెనఁట! ఇంద్రజిత్ప్రభృతి దేవద్వేషుల నీవే సంహరించితి వఁట! రణంబులో మూర్ఛితుండవై యున్న సమయంబున రావణుండు తన పరివారంబుతోఁ గూడ వింశతి భుజంబులచేతను నిన్ను లేవనెత్తలేక తొలంగెనఁట! 1తాదృశమహిమంబు గల నీవే వసుదేవ గృహంబున బలరామాకారంబు వహించి కొన్ని యాశ్చర్య కార్యంబు లొనరించి, ఈ యుగంబున నాసూరి కేశవాచార్యుల గర్భంబున జనియించి, అనితర సాధారణ కార్యంబు లాచరించి భగవత్ప్రకాశిత ప్రభావుండవై యుండఁగాఁ, జూచియు, న్నందుఁగొందఱు రామకృష్ణాదులయందు మానుషమనీషచేసి నిందించిన చందంబున నిన్ను మానవ మాత్రునిగా నెంచి యనాదరింపుచున్నారు. వారలందఱు న్నాసురప్రకృతులె యని బాసచేసి గెలువవచ్చు. ఇందుకు సందేహమా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 64

రామానువర్తన స్వభావా! త్రేతాయుగంబునఁ బదునొకండువేలయేండ్లు రామానుమోద 2మూలంబైన యాడిగంబుల వెదకి చేసిన మహానుభావుండవు గావునఁ, దత్స్వభావం బీ యవతారంబునను న్విడువక యిక్ష్వాకుకుల దైవతంబగు రంగనాయకుల పరిచర్యలు సేయుట రామముఖోల్లాసకారిగా విచారించి, శ్రీరంగంబు ననె వసించి, తద్వల్లభు కైంకర్యంబులు నిజాజ్ఞా క్రమంబునఁ దప్పక నాచంద్రార్కంబై నడచునట్లు దిద్దితి వౌరౌర! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 65

భూతపురినిలయా! మీకు భాగినేయతనయుండైన కందాళయాండాను మీ యవతారదేశంబగు శ్రీ పెరుంబూదూరిలో మిమ్మర్చారూపంబున నభిముఖంబు చేసికోవలెనని తలంచిన వేళ నేత్రోన్మీలనముహూర్తమం దక్కడ శ్రీరంగంబు నందు శిష్యుల కుపన్యాసంబు సేయఁగా, నదరిపాటునఁ గోకనదపత్రంబుల కరణి నరుణంబులైన మీ నేత్రంబులు సేవించి, విస్మయాకులాంతరంగంబుల 'నిది

1 (ఉ) ఏతాదృశ—
2 (ఉ) మూలంబులైన

యే'?మని యడిగిన కూరేశాదుల 'కాండానుకృత్యం బిందుకు కారణం'బని యాన తిస్తిరఁట! యోగసంపిద్దిని సౌబర్యాదులను మించిన జ్ఞానవ్యాప్తిచేతఁదదాకారంబు నందును స్వాకారంబునందుంబలె నేకాకారవ్యాప్తిఁ గనిపింపఁ జేసితి; రిది మాదృశప్రాకృతు లేమని తెలియనేర్తురె? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 66

త్రిత్వజ్ఞమనోహరా! హస్తిగిరియందు మీకు తురీయాశ్రమస్వీకారంబుఁ జేయువేళ 'దాశరథికూరేశులు దక్క తక్కిన సమస్తదేహసంబంధులతోడి సంగంబును విడిచితి'నని పలికిన మీ పలుకులు విన్నవారలై, వారిరువురు వచ్చి ప్రథమోపాత్తశిష్యులై ఆశ్రయణంబుచేసి, ఛందానువర్తిత్వంబున పాదుకా జలవారణాకారత్వ ప్రసిద్ధి వహించిరి. మీ యభిప్రాయంబుచేతనుం ద్రిదండ యజ్ఞోపవీతంబులుగా నాచార్యసన్నిధిని వర్ణితులైరి. ఇత్తెఱంగున నవినాభూత 1 ధర్మవద్వినియుజ్యమానులై జగత్పూజ్యులౌటకుఁగారణంబు భవత్కృతవరణంబు గదా! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 67

ప్రపత్తియోగ స్వరూపజ్ఞా! పేరరుళాళరు నియమన ప్రకారంబున మీరు పెరియనంబిగారి నాశ్రయించవలసి కోవెల చేరుటకై కాంచీనగరంబు వెడలి, నాటి ప్రయాణగతిని మధురాంతకంబులోఁ జక్రవర్తితిరుమగన్‌కోవెల ప్రవేశించి ప్రదక్షిణంబుఁ జేయుచున్న చోటి కప్పుడె యరుగుదెంచియున్న పూర్ణాచార్యులం గని, సాష్టాంగదండప్రణామంబుచేసి. ఆడఁబోయిన తీర్థమెదురుగా వచ్చెనన్న కరణి యిటువలెనుండవలదే! యని యాశ్చర్యహర్షకలితాంతఃకరణంబునఁ దదంఘ్రియుగళంబు శిరంబున నిడుకొని, యానందబాష్పంబు లొలుకఁ బుల కాంచితగాత్రంబున గద్గదస్వరంబుతో స్వాభిప్రాయం బెఱుకపఱచిన, నతఁడును 'మంచిదె; రేపటువలెనే వరదుని సన్నిధి నయ్యా' ననినఁ 'దావత్పర్యంతం బీ దేహంబు స్థిరంబని యెట్లుండుదు? 2నిందుల కాళవందారు పనియె సాక్షికాదే?

1 (ఉ) ధర్మపద్ధతి నియుజ్యమానులై

2 నిందుకు నాళవందారులె సాక్షిగాదె?

సర్వజ్ఞులైన మహాత్ములు మీరెఱుంగరె?' యని పరమార్తితోఁగూడ మగుడ విన్నవించఁగా, నతనికిం దియ జనించి యథావిధి ననుగ్రహించఁగా నప్పుడె పంచ సంస్కారంబులును లభించితిరఁట! ఇది విచారించిన, దేశకాలాదినియమంబు లేమియును లేనిదిగాఁ గలిగినది ప్రపత్తి యోగంబని నీవె ప్రకాశింపఁ జేసి చూపి నట్లుండె నౌర! భళీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 68

అకించన జనాధారా! బాల మూక జడాంధ పంగు బధిరులు పరగతస్వీకార యోగ్యు లనియెడి శాస్త్రార్థప్రవర్తనంబు నీవలననే కలుగ, విని పెద్దలు నాకాన తిచ్చిరి. ఒక మూక ముముక్షుత్వంబున మీకు శిష్యుండై 'మోక్షోపాయంబుదెలుపవే!' యని సంజ్ఞచేసి యడిగి పరమార్తితోఁ బరితపించఁగాఁ జూచి, మీచిత్తం బపార కరుణాయత్తంబై, యతని నేకాంతప్రదేశంబునకుఁ దోడుకొనిపోయి 'ఇదె మోక్షోపాయం'బని యొక యర్థంబు కృపచేయఁగా, నది[1] పలుగణిసంధుల నాళ్వాను సేవించి, 'యీజన్మమెత్తక మూఁగనై జనించిన తనకు న్నీలాభమేఘటించుఁగదా!' యని కాంక్షించెనఁట! తదనంతరం బమ్మూకయుం దల్లడముడిగి, నెమ్మదిని మీ యందుఁ [2]బరత్వ ప్రపత్తిఁ జేసెనని వింటి. నేను బాలుండను. అకించనుండ నగతికుండను. నన్నుఁ దాదృశ దయారస పాత్రునిఁగాఁ జేయు నేడు. మా తండ్రీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 69

కృపామాత్ర ప్రసన్నాచార్యా! అనాది విషయ వాసనా బలమున విపరీత రుచి భూయిష్ఠుండనై. హితాహిత విభాగ జ్ఞానవిదూరుండనగు నన్నుం జూచి, యనర్థవర్ధకంబైన నావృత్తిం జూచి, అపరిమిత సద్గుణాకరుండవగు నిన్నుం జూచు కొన్న,నన్ను దయచేసి. [3]రక్షించుట మేలు. నీకదేఘనత. కాక,'పరీక్షించిరక్షించెద" నని మఱి మఱిం జూచిన, నాయందాత్మ గుణంబులు కనిపించునా? కనిపించవు. అంతమాత్రమె కాదు; నీవు నన్ను రక్షించవైతివాయెనా, నీయంతరంగులె నీ దయ నేమని విచారింతురో? అది విచారించుకొనుమీ! శేషనగరాధినాథ!రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 పలుగాఁడి సందుల
2 (ఉ) పరతత్త్వ ప్రతిపత్తిని
3 (ఉ) రక్షించుటె

## 70

నిజజన కామాది దోషనివారకా! ఫాలలోచన రోషానల భస్మీభూత నిజాంగంబగు అనంగ గ్రహంబు మదీయాంతఃకరణంబునం దావేశించి, వెంటఁబడి, జన్మ జన్మాంతరంబులనున్[1] విడువక, జాగ్రత్స్వప్న దశా విభాగంబు లేక పీడింపుచున్నది. ఆత్మనాథునివద్ద జేర నియ్యదు.[2] పతితో భోగంబెటువంటిదో యెన్నడున్నెఱుంగను. సార్వకాలంబునుండి దీనిచేఁ జాలా కృశించి డస్సితి. ఇది యెటువంటి భగవన్మంత్రంబులనున్[3] వీడదు. పుణ్య తీర్థాచరణంబులనుం బోదు. దివ్యదేశ సంచారంబులచేతనుం దెమలదు. ఏమిసేతు? నీవు మహాయోగివర్యుండవు. నీవైతే దీని విడిపింతువని [4] వరవర యోగి ప్రముఖు లానతియ్యఁగా దెలిసితి. నిన్ను సందర్శించిన మాత్రంబున బ్రహ్మరక్షస్సులు మొదలుగావిడిచికదలెనట! ఇంకఁనీవేగతియని నీసన్నిధిఁ జేరితి. నీకు [5] శరణంబుఁజొచ్చితి. నీ శ్రీపాదరక్షలు నా శిరంబునఁ గాఁపుగాఁ బెట్టి, తావక చతురక్షరీ మంత్రరాజంబు నా జిహ్వాయంత్రంబున వ్రాపి, యీ గాపి బోఁ జేసినఁ మీ వాపి దిగంతంబుల వర్ణింతు. నేను తరింతు. సుఖింతు. నన్ను ననుగ్రహింపుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 71

ద్రావిడ వేదప్రభావవేదీ! చోళరాజభయాపదేశంబున వెల్లలు చాతి, మీరు మేలునాటికిఁ బ్రచ్ఛన్న వేషంబుతోఁ బోవుతఱినిఁ దత్కింకరులు తఱుముకొని వచ్చి వెన్నంటి కవియ్యఁగా నప్పుడు తదభిముఖంబై నిలిచి, [6] తట్టున భట్టనాథ విరచిత ప్రబంధంబునం దొక్క పాశురంబు నుడివి, యిసుక చల్లి, వారలదృష్టికిఁ గొండ యడ్డంబై నిలిచిన కరణి నుండఁజేసి, మీరును, మీ పరివారంబునుంగూడ [7] నావలికి దాఁటితిరఁట! ఈ కృత్యంబు విచారించిన, ఆళ్వారుల దివ్య ప్రబంధశక్తి యెఱింగిన యధ్యవసాయనిష్ఠుల కన్ని పాశురంబులును మంత్ర కల్పంబులె

---

1 (ఉ)వదలక 2 (ఉ) ఆతనితో

3 విడువదు. 4 వరవరముని ప్రముఖులు

5 శరణుఁజొచ్చితి 6 తట్టిన

7 నవతలికి

యని చూపి [1] చాటించిన యందమో; కాక, శత్రునిరసనసమయంబు గనుక, లక్ష్మణ బలరామావతారంబుల నాటి యస్త్రివేదిత్వ స్వభావం బవశ్యంబుగా నేటి యవతారంబుననుం గనిపింపఁజేసి, 'యెవ్వరికిని జన్మాంతర వాసన విడుచునే?' యని అభినయించిన చందమో? తెలియ; దీసంధి సందేహాస్పదంబై యున్న; దందఱికిం దెల్పి పఱచవే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 72

జైనవిషధర విహంగ పుంగవా! మీరు మేలునాటికి [2] విజయంబు చేసినప్పుడు మీకు శిష్యుండైన తొండనూరి నంబి మీ శ్రీపాదతీర్థం బొసంగి, తత్ప్రభావంబున నా నగరంబేలుచున్న రాజుకూతురుం బట్టిన బ్రహ్మరక్షస్సును విడిపించెనఁట! అది కారణంబున నా రాజు మీకు శిష్యుండైన, విష్ణువర్ధనుండనే పేరుఁబెట్టి యభిమానించినం జూచి, తదీయులైన జైనమతస్థులందఱుం గ్రమ్ముకొని దొమ్మిగూడి 'వాదంబునకు ర' మ్మనిన, 'వేదంబును నిందించు మీరు ముఖావలోకన యోగ్యులు గా'రని, యాస్థానమండపంబునఁ దెరమఱుఁగుఁ జేసికొని వసించి, నిజంబైన శేషాకారంబు గైకొని, సహస్రముఖంబుల నజైవసహస్రం బుగ్గడించు యుక్తి కోట్లను విదళించి, పరాజయంబు నొందించి, యందఱినిఁ [3] గృతప్రతిజ్ఞానిశ్చయక్రమంబునఁ గలుగానుఁగ లాడించి, యేడునూటయెనుబది జైన [4] ప్రతిమాలయంబులం బెకలింపించి తెచ్చిన వెనుక, నొక మహాతటాక ఘటనంబుఁ జేయించితిరఁట! ఎటువంటి యాశ్చర్యకార్యంబులె! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 73

వరముముక్షుజన [5] సమాశ్రయణీయచరణా! త్వదన్యదైవభావనాగంధదూరుండైన [6] యాంధ్రపూర్ణుని స్వరూపంబు త్వదేక శేషంబును, ఉపాయం

---

1 చాటు చందమో; 2(ఉ) విజయంచేసినప్పుడు
3 (ఉ) తత్కృత ప్రతిజ్ఞా. 4(ఉ) ప్రతిమా నిలయంబులం
5 (ఉ) సమాశ్రయణార్హ చరణా! 6(ఉ) యాంధ్రపూర్ణుండు

బకారణత్వదంగీకారంబును, పురుషార్థంబుత్వ న్ముఖవికాసావహ కైంకర్యంబు నుంగాస్వరూపోపాయపురుషార్థయాథాత్మ్యంబులు నిష్కర్షించిన మహామనస్కుండు గనుకఁ, దద్విజ్ఞాపితార్థంబంగీకరించి, తదభిమతప్రకారంబున భావిముముక్షుజనో జ్జీవనార్థంబుగా స్వస్థలంబగు శాలాగృహాఖ్యగ్రామంబున స్వచరణారవింద ప్రతికృతి యును, స్వకీయశ్రీపాదతీర్థపరిపూరిత శాతకుంభ ప్రదేశప్రకాశమానస్వాంతర తరంగాయమాన ప్రస్రవణవారి నిర్ఘరపూరితంబగు కాసారంబునుంగరుణారసం బుప్పతిల్ల ననుగ్రహించితిరఁట! మీ దయాపరత్వంబును, వతని పరసమృద్ధి పరత్వంబును వర్ణింప శక్యమా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 74

[1]భక్తాతిశయతారకా! తనకన్న తనదాసులె యధికులౌదురనుట గుహ శబరి విదుర కుచేల వైదిక నారదాదుల యెడలఁ దాను బహుమతిపూర్వక ప్రతి పత్తులుచేసి చూపిన భగవతుని చందంబున, నీవున్ను నీదాసులలోఁ బిళ్లయురంగా వెల్లిదాసుల కరంబుఁ గరంబునఁ బట్టి, యతండు పావనపావనుండౌట తేటపఱచి తివి. అతని పత్నియెడలఁ దత్త్వార్థ నిష్కర్షలు దెలియుటకై శ్రీవైష్ణవుల నంపించి, తద్గత జ్ఞానపూర్ణత బయలు చేసితివి. ఎంబారుకు నీయభిష్టానంబె యొసంగి తివి. దాశరథిసూరి నందఱికి శిరసావాహ్యునిఁగా నొనర్చితివి. శ్రీవత్సాంక [2]మిశ్రునివలన ముక్తి కరస్థంబయ్యెనని యనుమోదించితివి, ఈ వింతలు విన్న మాత్రంబున దాసునికి మఱి నోరూరుచున్నది. నన్ను మీ వారి యభిమానాంత ర్భూతునిఁగాఁజేసి, వారల పంచలు గాచియుండే భాగ్యంబొసంగుము. నా కదే పదివేలు సుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 75

శ్రీమానస్తుత్యా! ద్వాత్రింశల్లక్షయోజనవిస్తారంబగు క్షీరసాగరంబులోఁ బవ్వళించియున్న యనిరుద్ధస్వామియొక్క దివ్య మంగళవిగ్రహంబు సార్ధద్విలక్ష యోజనదీర్ఘంబఁట! నీ పతనికిఁ దల్పంబై యుండే వాఁడవేనఁట! నీ యాకార విభవం బెంతనవచ్చు? నీ కరణి నిటువలె నంతరంగ పరిచర్యాచరణంబుల కర్తృ

1 భక్తాతిశయాకారా!; (ఉ)భక్తాతిశయకరా!

2 (ఉ)మిశ్రులవలన

లుంగాక, తత్పురోభాగంబునకు రానుంగూడక, బ్రహ్మేంద్రాదిదేవత లహంకార గ్రస్తజీవులుగావున, హిరణ్య రావణాది దుష్టరాక్షస రాజలోక వధార్థం బాయనిరుద్ధ స్వామినిఁ గూర్చి మొఱయిడవచ్చినప్పు డుత్తరకూలంబుననే పడియుందురంట! వారికి న్నీకు న్నెంతటి తారతమ్యంబున్నది! వారి యహంకారగ్రస్తత, తద్దత్త స్వపదాధికారంబులు గలవారై యుండియుం గృతఘ్నులై గర్వించి తత్ప్రాదుర్భావ విశేషంబగు శ్రీకృష్ణునియందుఁ జేసిన వస్త్రాపహరణ శిలాప్రవర్షణాది కర్మంబుల చేతనే సకలలోక ప్రసిద్ధంబు. అటుగనుక, నీకుఁ గింకరులైనవా రా బ్రహ్మాది విభూతుల నపేక్షించక తృణీకరించి, వారలచేతనే పూజలందుచుం బరమపదారోహ ణంబుఁ జేయుచున్నారు. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజ శేఖరా!

## 76

*భవబంధ[1]విమోచకా! సత్యసంకల్పాది విశిష్టంబగు పరబ్రహ్మంబు సృష్టి స్థితి సంహార సంసార విమోచనాదులకుఁ దానేకర్తగావున, సృజించనవసరం బైన నిజేచ్ఛనే [2]చతుర్ముఖుని సృజించి, తదంతర్యామియై దక్షాదులం జనింపించి, తన్ముఖంబున జగజ్జీవులఁ గలిగించి సృజించుచు, స్థితికిఁ దా విష్ణుత్వంబునొంది, మనుముఖ్యాధికారుల కాత్మయై ధర్మోపదేష్టయగుచు, జననీ జనక దేశిక భూపాల దానశీలజనాదిమూలంబుగాఁ బాలనంబుసేయుచు,సంహరింపసమయంబైనచోఁ బంచా ననాంతకానలప్రముఖ తత్తజ్జంతుజాతాంతర్యామియై సంహరించఁగలిగి, సంసార విమోచన నిమిత్తంబున సహస్రవదనావతారుండవగు నీయందు నిలిచిన, నీవు పూర్వోక్త చతుర్ముఖ సమస్తబద్ధచేతన వ్యావృత్త నిత్యసూరిశ్రేష్ఠుండవు గనుకఁ, దన్మనోరథపూర్తిఁ జేయుటకు స్వశిష్యభూత చతుస్సప్తతి సంఖ్యా సంఖ్యాత సింహా సనస్థ తచ్ఛిష్య ప్రశిష్య పరంపరాముఖంబున బద్ధాత్మలకు ముక్తి యొసంగు చున్నాఁడవు. చతుర్ముఖాదులకు న్నీకున్ను తారతమ్యంబు విచారించినఁ, గారాగృహ నిర్మాణోపమానాధికారంబు వారిది; కారాగృహబద్ధజన విమోచన యువరాజోపమా నాధికారంబు నీది. ఇది సారజ్ఞులై వివేకింప నేర్చిన నిర్మత్సరులకె తెలియును.

---

*ఈ వచనము కాగితపు ప్రతిలో 77 వదిగా నున్నది.

1 (ఉ)విమోచనా!

2 (ఉ)తొలుతనె చతుర్ముఖుని సృజియించి,

కితరులకుఁ దెలియ; దిదేమి చిత్రమో? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 77

*భగవద్విలక్షణావతారా! పర వ్యూహ విభవాంతర్యామ్యర్చావతారాచార్య రూపంబున షట్ప్రకార భేదభిన్నం బీశ్వర స్వరూపంబు. అందుఁ బరవ్యూహంబులు రెండున్ను నిత్య ముక్తైక భోగ్యంబులు గావున దేశ విప్రకృష్టంబులు. విభవంబు తత్కాలసన్నికృష్టైకమాత్ర గోచరంబుగనుక కాలవిప్రకృష్టంబు. అంతర్యామిత్వంబు యోగసంసిద్ధి పరిశుద్ధ జనానుభావ్యంబైన కతంబునఁ గరణ విప్రకృష్టంబు! అర్చావతారం బనాలోచిత విశేషాశేషలోకసంభావ్యంబగుటచేత దేశకాలకరణవిప్రకృష్టంబుగాదు. అయినను నజ్ఞాత[1]జ్ఞాపనాద్యదర్శకంబై, షట్ప్రకారంబువంటిది గాదయ్యె. కావునఁ బూర్వోక్తపంచప్రకారంబులకన్న సమస్తలక్షణోపశస్తసర్వోత్తర చరమస్వరూపంబగు నీవే సర్వసర్వజ్ఞసరసజన సంభావనీయుండవైతివి. ఎటువలె నంటివా యెనా, బీజభూతేక్షుఖండ తదుద్భూతరసాలదండ తత్సారాకారరసపూర తత్పరిపాకపరిణతశర్కరాద్రవ్యతత్పాకావస్థావిశేషఘనీభూతఖండశర్కరాదివస్తువులుత్తరోత్తర పర్యాయతయా జన్యజనక భావసిద్ధంబులె యైనను, సర్వోత్తరరూప ఖండశర్కరే శ్రేష్ఠమై, సర్వస్పృహణీయమయ్యెఁగదే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 78

గురుపదమూర్ధాభిషిక్తా! ఘటకత్వోపాయత్వభేదంబున ద్విప్రకారాత్మకం బాచార్యత్వంబు. అందుఁ బ్రథమ ప్రకారాచార్యత్వంబు ఉపదేష్టృత్వ విశిష్ట సర్వగురు సాధారణంబు. ద్వితీయప్రకారాచార్యత్వంబు వ్యవస్థితంబు. అది నీయందే అసాధారణంబై యుండు. ఎట్లన్న, శేషియైన యతండె తనపదంబున నిన్ను నిలిపెఁ గావున నీశ్వరాభిప్రాయలబ్ధంబౌటచేత, నిదె సత్సంప్రదాయంబని సర్వపూర్వాపరాచార్యానుష్ఠాన క్రమంబునుం దార్ఢ్యకంబుగాఁ బెద్దలు నిర్వహించు చున్నారు. ఈతద్విపరీతోపాయాత్మకాచార్యత్వంబులెల్ల స్వస్వాతంత్ర్యసంపాదితంబు

---

*ఇది కాగితపు ప్రతిలో 76 వ వచనముగా నున్నది.

1. జ్ఞాపకార్థదర్శకంబై, (ఉ)జ్ఞాపనాద్యర్థధర్మంబై

లఁట! [1]వారును, వారి సంబంధులునుం జేరు చోటేది? ఆనతియ్యవే! శేషనగ రాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 79

సర్వాచార్యసమాశ్రయణీయా: కారణభూత సర్వేశ్వరుండే శేషి గావున నతండు సర్వ సమాశ్రయణీయుండయె, అతండు జ్ఞానాత్మకుండుగనుక, నతని కనురూపంబై, ఆధేయత్వ విధేయత్వ శేషత్వరూప శరీరత్వ లక్షణంబులతోడ నజడంబైన దివ్య మంగళ విగ్రహంబయ్యె. శఠవైరి తదీయ చరణకమల యుగళాకారం బమరియున్నవాఁడవు నీవు. ఇట్లైనచో శేషిని సమాశ్రయణసిద్ధి చరణ సమాశ్రయణద్వారంబెయౌఁ గావునఁ, దచ్చరణ స్థానంబైన నీవె సమస్త చేతన సమాశ్రయణీయుండ వైతివి. ఇటువంటి నిన్ను వినాచేసి భగవదాశ్రయణంబు చేసితిమనఁ గూడునా? అటువలెఁ జేసిన దురహంకారులు భగవత్ప్రసాదపాత్రు లౌదురా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 80

సర్వోత్తమోత్తమా! బ్రహ్మరుద్రేంద్రాదిదేవతాజాతంబులో శ్రీవిష్ణు వధి కుండని సకల వేదంబులు ఘోషింపుచున్నవి. తదుపబృంహణంబులం దతఁడు తనకన్నఁ దన కనన్యార్హ శేషభూతులైన దాసులే యధికులని శాసింపుచున్నారు. తాదృశప్రభావంబుగల పరాంకుశ నాథ యామునాదులు నిన్నే యధికునిఁగాఁ దెలిపి, తాము నీవారై, యందఱికి న్నిన్నె చూపి చాటిరిగనుక, నీవు సర్వోత్తమప్రభావసంప న్నుండ వౌటకు నిస్సందేహంబు. ఈ ధర్మజ్ఞ సమయంబు విశ్వసించి, యితరం బులు మాని, త్వదన్యదైవ విముఖుండై, నీవె దైవంబని నిలిచిన సర్వాధికుం డాంధ్రపూర్ణుండు. తన్నిష్ఠ తన కొసంగుమని నిన్నుఁ బ్రార్థించిన తత్త్వయాథాత్మ్య నిర్ణేత వరవరయోగి. తన్నామ మంత్రకృత సర్వహితోపదేష్ట భట్టాధిపయోగి. తత్సంబంధ సంబంధపరంపరా చరమావధి దాసుండ నేను. నాభాగ్యం బెంతని గణింతునె? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 81

పరాత్పరమూర్తీ! భూమండలంబున నీ వవతరించినప్పుడే కలినిఁ [2]దొలంగఁదోలితివి. బాలభావంబుననే మూఁగకు మాటలాడ నేర్పితివి. కౌమా

1 (ఉ)వారున్ను, వారి సమ్మంధులున్ను 2 పారదోలితివి.

రంబున బ్రహ్మరక్షస్సు పాపంబుం బాపి ముక్తి యొసంగితివి. శాస్త్రాభ్యాసంబుఁ జేయు వేళ శ్రుత్యపార్థకల్పకుండైన యాదవప్రకాశుని పక్షంబు శిక్షించితివి. వేదాంత [1]పరిచయోచితకాలంబున బ్రహ్మవిద్వందిత యామునాచార్యులకు స్పృహణీయుండవైతివి. ముముక్షుత్వదశను వరదరాజులఁ బ్రసన్నీకరించి యాఱువార్తలు విని, యాతనిచేతఁ బ్రాణవన్నిరూపితుండవైతివి, రంగనాయకులచేతఁ బిలిపించుకొని, యతని వద్ద యువరాజవై నిలిచితివి, తిరుపతులు సేవించుచుం బోయి, తిరుక్కురుంగుడినంబికి మంత్రరత్నం బొసంగి, సర్వేశ్వరునకు న్నాచార్యుండవైతివి. దిగ్విజయం బాచరించు సమయంబున శారదచేఁ బొగడిక లందితివి. ఇటువంటివే యనేకంబులు నీ దివ్య చరిత్రంబు లొక్కొక్కటే నీ లోకోన్నతత్వంబుఁ బ్రకటంబుచేసి [2]చాటించఁగా, నితరు లుగ్గడించుచుం దిరుగనేల? కొండమీఁదపెట్టిన మహాదీపం బొకరు చూపక కనిపించదా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 82

శ్రీ అజ్ఞానత్రయనివర్తకా! హిరణ్య రావణ [3]నరక కంస శిశుపాలాదులు గలుగఁగా, వారలనుండి భగవంతుని స్థైర్య ధైర్య శౌర్య వీర్య పరాక్రమాదిగుణంబులు ప్రకాశించినట్లు, శంకర భాస్కర యాదవాది కుదృష్టిజనులు గలుగఁగా మీ సమానాధిక రహితవైదుష్యంబును, వేద వేదాంత వాక్యార్థ వివేచనపాటవంబునుం బ్రకాశంబయ్యె. ఈ యాకారంబున వారును మీ ప్రభావప్రకటనంబుఁజేయుటకే జనించిన వారైరి గావున, నిందాయోగ్యులు గారనవచ్చునని తలంచుచున్నాడనే! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 83

శ్రీ అమోఘసంకల్పా! కలిగర్వ విజృంభణంబు స్తంభింపంజేయవలెనని తలంపుచున్నాఁడవో? దివ్యదేశంబులందుఁగొన్ని [4]పునరుద్ధారితంబులు[5]గావలసెఁ

---

1 పరిచర్యోచిత—

2 చాటంగా,

3 (ఉ)బాణ కంస శిశుపాలాదులు

4 పునరుద్ధారకంబులు

5 (ఉ)గావలసినవిగా

గదా! యని యాలోచనసేయుచున్నాఁడవో? ఉభయ వేదాంత ప్రవచన కర్తలగు దర్శన నిర్వాహకుల సమృద్ధికై యోచనసేయుచున్నాఁడవో? శైవ, మాయావాద, బౌద్ధ, పాశుపతాది దుర్మతస్థ కోలాహలం బడంచుటకు వితర్కింపుచున్నాఁడవో! జ్ఞాన భక్తి విరక్తిసంపన్న మండితంబగు స్వదర్శనంబులో నెరసులు రాకయుండ పెద్దసలెనని చింతింపుచున్నాఁడవో? దేహాత్మాభిమాన ప్రముఖ ప్రతికూలవర్గ సమానీత ద్రవ్యంబు స్వీకరింపవలసెఁగదా! యని జుగుప్సచేయుచున్నాఁడవో? మదీయాచార్య మనోరథ [1]నిమిత్త కృత మామక విజ్ఞాపనం బంగీకరించి, గోపురప్రాకార మండపాది కల్పనాత్మక సకలవిధకైంకర్యంబులు గైకొనుట కూహింపుచున్నాఁడవో? నీ యవసరం బెఱుంగక, చిత్తవృత్తిం దెలియక, నిన్నభిముఖంబు చేసికొన్నవానింబలె నప్పుడప్పుడు [2]తోఁచినవెల్ల విన్నపంబులు సేయుచున్నవాఁడను. ఇది యసహ్యమై తోఁచదుగదా? నీవు క్షమాగుణనిధివి. నేనైతే బాలుండను. అనభిజ్ఞుండను. ఈదృశాపరాధ శతంబుల ప్రతిక్షణంబున నపరిమితంబులుగాఁ జేయున్నాఁడను. ఎటువలె నోర్చెదవో? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 84

ప్రావనభవ్యనామా!—ఇళయాళ్వారే! లక్ష్మణాచార్య! యతికులచంద్ర! ఉడయవరే! ఎంబెరుమానారే! శ్రీభాష్యకారా! శేషావతార! శఠగోపంపొన్నడీ!—అనియెడి మీ తిరునామంబులు మీకు [3]వాచకంబైన చతురక్షరినింగూడి నవసంఖ్యతో భూమియందు వెలసి, యాశ్రితుల నవానవ కర్మంబులం బాపి యభీష్టంబు లిచ్చుటకు సమర్థంబులై యున్నవి. ఇవే మాకుఁ బద్మరాగ మౌక్తిక ప్రవాళ మరకత పుష్యరాగ వజ్ర మహేంద్రనీల వైదూర్య గోమేధికనామ నవరత్నంబులు. ఇవే పద్మ మహాపద్మ శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీల వరాఖ్య నవ నిధానంబులు. ఇఁక మాదారిద్ర్యాది దోషంబులు దొలంగె. దాసబృందంబెల్ల ననన్యప్రయోజనపరత్వంబున మెలంగె. అస్మన్మానసంబు లవాప్తసమస్తకామంబులై చెలంగె. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1 నిమిత్తీకృత—

2 తోఁచినట్లా

3 (ఉ)ముఖ్యవాచకంబైన

## 85

యతీంద్రా! నీవున్నచోటు త్రిదివంబు. నీ యొద్ది భూసురోపాధ్యాయ గణం బమరగణంబు. నీ యాస్థానమండపంబు సుధర్మాఖ్య సభ. నీపై భక్తి కామధేనువు. నీ మంత్రంబె చింతామణి. బ్రహ్మసూత్రధారులు పేర్వేరనీసూక్తి పరంపరల నుపన్యసించి చూ(పగాఁ జూచుట రంభాదులనాట్యంబులు గనుంగొనుట. ఉచిత సమయంబుల భక్తిపరవశులు నీపై సంకీర్తనంబులు పాడఁగా నాకర్ణించుట గంధర్వగానం 1బాలించుట. భవ్యదివ్యప్రబంధకృత భవచ్చారిత్ర పర్యాలోచ నంబులుచేసి చొక్కుట పారిజాత మందార హరిచందన సంతాన కల్పకాఖ్య సుర తరువాటీ విహరణవిలాసం బందుట. నీ తీర్థప్రసాదంబు లుపభోగించుట యమృ తంబు గ్రోలుట. నీ పరిచర్యలతో మెలంగుట సుఖంబనుభవించుట. ఇట్లు నీ పరిసరంబున యావదాత్మభావియైన మహానందం బనుభవించు దాసులకు పతనభీతి విశిష్ట, దైత్య, దాన, వాతంక సంకలిత ప్రాకృతానిత్యస్వర్గం బసారంబై కనిపిం చుట కుచోద్యమా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజ శేఖరా!

## 86

పరమపదప్రాప్యభూతా! సర్వేశ్వరునకుఁ గల శుద్ధసత్వ, మిశ్రసత్వాత్మ కంబులైన విభూతులు రెండు. ఆ రెంటియందు మిశ్రసత్వం బతనికి లీలోపకర ణంబఁట! శుద్ధసత్వంబు భోగోపకరణంబఁట! ఏతదుభయస్వభావంబులం దెలిపిన తత్త్వజ్ఞు లివ్విభూతి హేయంబనియు, నవ్విభూతి యుపాదేయంబనియు. నివ్విధం బున నుపన్యసించిరిగాని, విచారించిన, శుద్ధ సత్వంబువలె మిశ్రసత్వము న్నతనికి శరీరంబెయౌఁగావున, హేయంబన వెఱతు. శుద్ధసత్వం బుపాసక ప్రపన్న సముదాయ సాధారణస్థానంబుగనుక, రుచింపదేమిసేతు? ఇంత విచారించ 2నాకేఁటికి? ప్రపన్నుండనా కాను. ఉపాసకుండనా మొదలనే కాను. నీయభిమా నాంతర్భూతుండనైన దాసవృత్తివాఁడను నేను. నన్నేలుకొన్న యుభయ విభూతీ శ్వరుండవు నీవు. నీయంఘ్రికమలయుగళంబె నా కిరవగు పరమపదంబు. నిర్హేతు

---

1 (ఉ)బాలకించుట.

2 నాకేమిటికి?

కంబైన నీ కారుణ్యంబె తత్ప్రాపకంబు. త్వన్ముఖవికాసావహకైంకర్యాను వర్తనంబె నాముక్తిసుఖంబు. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతి రాజశేఖరా!

## 87

శ్రితాపన్నివారకా! సంసారం బనాదిగావున జన్మంబులసంఖ్యాతంబులు తత్తజ్జన్మంబులందు నేఁజేసిన కర్మంబులు ననంతంబులె. తత్కర్మానుభవనిమిత్త సంప్రాప్తతాపత్రయాభితప్తంబు నాహృదయంబు. అందు నీవె వసతిఁ జేసికొని నిల్చియున్నవాఁడవు. నీదివ్యమంగళవిగ్రహం బతిసుకుమారంబు. ఎటువలె సహించి యందుండఁగలవని నీనిమిత్తంబు తల్లడింపుచున్నవాఁడను. నాకొఱకుఁజింతసేయ ; నది నాకు [1]సుఖమే. నీవు [2]సుఖించవలసియైన, నాతాపంబు లుడిపి చల్లఁజేయుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 88

వాత్సల్య[3]జలనిధీ! త్వదీయ దివ్యమంగళ విగ్రహవిషయసౌకుమార్యాది జ్ఞానంబులేని బాల్యంబునఁ జపలుండనై నాయక్కఱలే చూచుకొని, యాపత్సమ యంబుల రమ్మని నిన్నుఁ బ్రార్థించితి. అప్పుడెల్లా నీవు గోవత్సన్యాయంబున నత్యంతవ్యామోహాతిరేకంబుతోడ విజయంబుచేసి, కటాక్షించి, యాఱడించితివి. నీకెంత శ్రమంబు గనిపించెనో? అది నీకెంత భారమై తోఁచెనో? నే నిటువంటి కఠినమానసుండను. అపరాధిని. నికృష్టుండను. ఇప్పుడు [4]న్నాఁటివలెనే నీవు రావైతివని, చాపల్యంబున నాప్తులతో రచ్చఁబెట్టి దూఱుచున్నవాఁడను. నాయజ్ఞానం బెంతని గణింతునె? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 89

[5]క్షమాగుణనిధీ! సంప్రదాయార్థరాశినిర్భరంబగు నీ దర్శనంబు నీ భండా రంబు. అది నీవస్మదాచార్యుల వశంబుఁ జేసినావు. వారి గర్భంబున జన్మించిన

1 (ఉ)సహజమె.

2 (ఉ)సుఖించవలసియైనా,

3 జలధే!; (ఉ)జలధి!

4 న్నాటువలెనె

5 క్షమాగుణనిధే!

6 నీవె యస్మదాచార్యాధీనంబుఁ జేసినావు.

కారణంబున నా కాయిక్కువ * గనిపించిరి. అది నేఁచనేరక నావంటి వంచకులతో [1]సహవాపించి బయలుచేసి నీ భండారంబునకు ద్రోహంబుచేసితి. నీ చిత్తంబునకుఁ [2]గలంకుఁ బుట్టించితి. నీ కాయాసవిచారంబులు సంపాదించితి, నే నాజ్ఞాహ్వారుండను, చాలా దండనీయుండను. నీవిందులకెంత చేయించినను జెల్లుబడియె. అవునైన రాజపుత్రాపరాధన్యాయంబున లఘుదండనఁబుఁజేయఁదలంచిన వాఁడ వైకాఁబోలు, నీ సన్నిధిసేవకెడఁబాపి యీ దూరదేశంబునఁ [3]బడవైచితివి. ఇఁక నీ చిత్తము, నా భాగ్యము. ఇటువంటి నన్ను మన్నించియేలుకొన్నప్పుడు గదా, నీకీర్తి నానాలోక [4]విశ్రాంతంబగు. నా స్వామీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

# 90

అసంఖ్యేయ కళ్యాణగుణగణోజ్జ్వలా! నేఁజేయు నపరాధంబు లోర్వంగా నిన్ను క్షమావంతునిఁగాఁ దెలిసిరి. నాదోషంబు లింపు చేసికొనంగా నిన్ను వాత్సల్యవంతునిఁగా నెఱింగిరి. నా మాలిన్యంబుఁ దొలంగించఁగా నిన్ను శుచియని నిశ్చయించిరి. నిరవధిక దుఃఖినైన నా దుఃఖంబులఁ బాపఁగా నిన్ను దయావంతునిఁగా నెంచిరి. అతిహేయుండనైన నా కంతర్యామివయ్యు, నిర్మలుండవైయుండఁగా నిన్ను హేయప్రత్యనీకుండనిరి. నాకు వలసిన పురుషార్థంబులన్నియు న్నీవలననే లభించితిఁ గనుక, నిన్ను మహోదారుండని వర్ణించిరి. ఇవ్విధంబున నా గుణంబుల నుండి, నీ గుణంబులు గుప్పు గుప్పునఁ గనిపించునట్లు మెఱుఁగెక్కించి చికిలీచేసెడి పనివాఁడను. నన్నుఁ జెంగిపోనీయక నీ కొలువుకు నిలుపుకొనుము. నా వంటి పనివాఁడు నీ సముఖంబున నుండిన నీకుఁ గీర్తి సుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

* 'కనఁజేసిరి' అను ప్రేరణార్థమును గ్రహింపవలెను.

1 (ఉ)సహవసించి—

2 (ఉ)కలఁక

3 (ఉ)బడవేసితివి.

4 విక్రాంతంబగు.

## 91

సత్యప్రతిజ్ఞా! 'ఎటువంటి పాతకినైనాఁ బట్టి నిష్కళంకునింజేసి నీ యొద్దికిఁ దెత్తు'నని పరవాసుదేవునితోఁ బంతగించి వచ్చినావఁట! నేఁడు నన్నుండి నీకుఁ దత్పరీక్షాసమయంబబ్బె. ఏలాగంటివా? వివరించెద : ప్రతిబ్రహ్మాండ సృష్టి యందున్నవంతకోటిబ్రహ్మలస్మదపారపాపానుగుణంబుగా నానాయోనులంబుట్టించి, పుట్టించి, వేసటనొందిపోయినారు. దండించి, దండించి, రోసి, దండధరు లసంఖ్యాతంబుగా బెండుపడి విడిచినారు. కల్పకల్పంబులను రక్షింపఁ జూచి సర్వేశ్వరుండు ననంతావతారంబు లంది, యంది, చేతఁగాక చాలించినాఁడు. ఈ యందంబున నరవిందసంభవాది బృందారకాగ్రగణ్యులందఱినింగెలిచి, యెదురులేక, భూత భవిష్యద్వర్తమాన పాతకులలో సమానాధిక రహితుండనై తిరుగుచున్న వాఁడను. నన్నిటువంటి వానిఁగాఁ దెలిపి, తెలిపి, నీవు ధరాతలంబున మహాభూత నగరంబులో విభవావతారంబు చేసి, దిగ్విజయవ్యాపారంబున భూమెల్లఁ బరువ, బెట్టి, వెతకి, వెతకి, నూటయిరువది సంవత్సరంబులు పొంచితివి. నాఁడల్ల నన్ను దొరకించుకొంటివా? [1]ఇటివతల నేయే రూపంబులఁ బట్టఁ దలంచితివో నే నగపడి తినా? నేఁడిట్లర్చారూపంబున[2]నిల్లిందులవేంకటాచార్యుల కిష్టదైవంబవై నిలిచి, నన్నతని గర్భంబున జనియింపఁజేసిన కారణంబున నతండు పట్టి తెచ్చి నీకొప్ప గించె. ఆ సంతోషంబుననే తొడిఁబడి, విచారించక, నాకు నీపేరిచ్చితివి. నీవాఁడ ననిపించితివి. ఇప్పటికి న్నాపూర్వవృత్తి విడిచినవాఁడనుగాను సుమీ! అకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార అసహ్యాపచారరూప నానావిధానంతాపచా రంబు లపారంబులుగా నాచరింపుచున్నవాఁడను. మును పందఱినిం గెలిచినట్లు నేనే గెల్తునో? కాక, నన్ను మోక్షార్హునింజేసి రక్షించి, నీవె గెల్తువో? ఈ వినోదంబు శేషాశనాది నిత్యసూరు లవలోకింపుచున్నవారు. వారల నాలకించు! పరాకు! పరాకు!! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 92

సాధుజనాగ్రగణ్యా! సర్వేశ్వరునకు నే నెడఁబాయవి చెలికాఁడనై యుండి, అతఁడు న్నేనొక పిప్పలం బాశ్రయించితిమి. తన్మూలంబున నేమో తెలియః

---

1 ఇటీవల

2 (ఉ)నిల్లిందల–

దతవితో నాకు మఱ్ఱుబాటు ఘటించె. అతఁడు న్నాతోఁ బోరఁదొణంగె అయితే నేమి? ఛేదన దహన క్లేశన శోషణాదులు నన్నంటని మహామహిమ కద్దు గావున, నన్నతనికిఁ జంపరాదయ్యె. చంపరాని పగ గెల్వరాదు గనుక, ఆ మార్గంబు విడిచి రామకృష్ణనృసింహాది వేషంబులు దాల్చి వచ్చి, నన్ను లోఁబఱచుకోఁ దలంచె. తలంచినప్పుడు నేనున్ను దేవ తిర్యఙ్మనుష్య స్థావరాద్యవాంతరభేద చిత్ర విచిత్ర రూపంబు లంది, లోఁబడక సరిపోరఁగా, ననంతకోటికల్పంబు లిత్తెఱంగున జరిగెఁగాని, నన్నతండు గెల్వలేఁడయ్యె. నే నిటువంటి దురహంకారమహా వీరాగ్రగణ్యుండ[1]నని నానాలోక ప్రసిద్ధంబు. దేవరకుం దెలివిదైన పనియెకదా? సర్వజ్ఞ శిరోమణీ! నీవు ధార్మికచక్రవర్తివి గనుక, 'యీరణంబునకుఁ గారణంబేమి?' యని వెదకి, తత్పిప్పల సమాశ్రయణవశంబున సంప్రాప్తంబైన దురహంకార భేతాళావేశంబని కని, యీ యిక్కువ నీవు తెలుపఁగాఁ దెలిపి, సర్వేశ్వరుం డిది తన శౌర్యాదిగుణంబులతోఁబనిగాదని, వాత్సల్య సౌశీల్య సౌలభ్యాద్యనుచర విశిష్ట కారుణ్యగుణ సహాయంబున [2]నిల్లిందులవేంకటాచార్యుల రూపంబున వచ్చి, యస్మజ్జనకుండై, పితాపుత్ర సంబంధప్రయుక్తస్నేహంబున గారవించి, చేరఁదీసి, మూలమంత్రమూలంబుగాఁ దదావేశంబు దొలంగించి, దాసునిఁగా నేలి నీసొమ్ముఁ జేసెఁగదా? ఇప్పుడుం దురాచారులతో సంగతి వచ్చినప్పుడెల్లా తత్స్వభావంబు గనిపింపుచున్నది. [3]నీవేమఱి యుండఁగూడదు. తదావేశంబు నిశ్శేషంబుచేసి, నీ సన్నిధినే యుంచుకొని కీర్తివహించుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 93

శ్రీకర్మవశ్యదివ్యావతారా! సంస్కృతద్రవిడశబ్దరూపోభయ వేదాంతంబుల యందుఁ బ్రాథమిక వేదాంతపదంబు నిష్కంటకంబుఁ జేయుకొఱకుసార సంగ్రహ, దీప, భాష్యాదిగ్రంథ విరచనంబు లొనరించి, యావదాయుష్యము దత్ప్రవచనంబే చేసితిరి, అటువలెనే ద్రవిడోపనిషన్మార్గంబు పరిపాలనంబు చేయవలసి, మీరే వర వరముని రూపంబున వెలసి, యావదాయుష్యముం దద్వ్యాఖ్యాన తత్తాత్పర్యభూతా

1 నిది

2 (ఉ)నిల్లింద వేంకటాచార్యుల—

3 (ఉ)నీవు మఱచియుండఁ గూడదు.

శేషరహస్య వివరణంబులనే ప్రవచనంబుసేయఁగా, నుభయవేదాంతంబులును మీ చేతనే ప్రతిష్ఠితంబులయ్యె. శేషావతారంబగు మీరే వరవరమునులగుట నిస్సం దేహంబౌటకుఁ, బూర్వరామానుజరూపంబున కనంతరంబగు బలరామరూపంబు శ్వేతవర్ణంబైన కరణినిఁ దద్విగ్రహంబును సుధాకరధవళవర్ణంబుచేసికొని యావిర్భ వించుటే సాక్షిగదా? శేషనగరాధినాథ ! రామానుజ! నమో నమో యతిరాజ శేఖరా !

## 94

ప్రతిమానుషావతారా! స్వావిర్భావవిశేష వరవరమునిరూవ కరిష్యమాణ ద్రావిడవేద తదంగోపాంగ తద్వ్యాఖ్యాన తదభిప్రాయభూతాశేషరహస్య తద్వివరణ ప్రవచనాత్మక జీవనవర్ధితానేక ముముక్షుజన బుద్ధిసస్యంబులకు నిరుపద్రవరక్షఁజేయు తలంపునఁ గదా, వేదశాస్త్రభరాక్రాంత [1]బాడబ పశు ధనహీన జంతుజాతంబునకు నిరవకాశంబుగాఁ దావక విభవావతారసమయంబుననే సార,సంగ్రహ,దీప, భాష్యాది గ్రంథమయావరణ నిర్మాణంబు చేసితిరి! [2]అట్లనే మీ కృషి [3]ఫలించె. పోఁకకు పుట్టెడుమోక్షంబయ్యె. ఇఁకనందఱముం బ్రతికితిమి. సర్వేశ్వరుండగుపరవాసుదేవుని తిరుమామణి మంటపంబను పెనుకణజంబు నిండి, వెల్లివిరిసె. ఈ కీర్తి నానా వైకుంఠంబులందును వెలసె. వెలయు. భళి! భళీ!! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 95

కలికలుష[4]నిరోధీ! నీ వీయవనితలంబున నవతరించి చేతనుల నందఱినిం భగవదభిముఖులుగా నొనర్చి, మోక్షమార్గంబునం దన్వయింపించిన కారణంబున, యాతనాశరీరార్థుల లేమి గనిపించి, యామ్యాదిమార్గయాయి చేతనజాతంబు లేక, తత్పథంబు వాడికె దప్పి, పాడై కసవు మొలచె. ఘాతుకయమదూత భీకరభాషి తార్భాట కలకలంబులు కఱవయ్యె. నరక కూపంబుల రూపంబు లేవులు దప్పె. చిత్రగుప్తులు వ్రాతలు [5]దప్పి, ద్యూతాది విహారంబులచేఁ బ్రొద్దు జరుపందొడంగిరి.

---

1 (ఉ)బాడబాశనహీనజంతుజాతంబునకు

2 అటువలెనె

3 ఫలించి,

4 విరోధీ!

5 (ఉ)తక్కి,

అంతకుం దేవేళలందుఁ జూచిన నంతఃపురకేళీలోలుండై, పారుపత్తెంబునకుఁ బాపియుండె, ఇవ్విధంబున యమరాజధాని స్ఫురణంబు దఱఁగి విన్ననయ్యె. నీ తంత్రకౌశలం బంతకుని వీడు పాడుచేసె. ఎంతని గణితు నీ వింత! శేషనగరాధి నాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 96

సకలభువనమాన్యా! తావక చరణారవిందసంబంధంబు గల జీవు లసంఖ్యాతంబుగాఁ బరమపదమార్గంబుఁ బట్టి *పరుష నడచిన [1]జైడపడక నడుపఁగా, వారల వీరలే సత్కరించువారు గనుక, సప్తార్చి, ర్దిన, పూర్వప, క్షోత్తరాయణ, సంవత్సరాభిమాని దేవతా, సమీర, సహస్రకర, చంద్ర, విద్యు, ద్వరుణ, శతమఖ, చతుర్ముఖులకు నేతన్ముక్తాత్మపరంపరావిషయ నిరంతరసత్కారంబులు సేయవలసిన యక్కఱలచేత సందడిపడి, నిజనిజాధికారోచితకార్యాచరణంబులకుఁ గాలంబు దొరకదయ్యె. ఈ చందంబున నీయాజ్ఞాపరతంత్రులై బ్రహ్మేంద్రాది దేవతలు భాగవతకైంకర్యం బన్వయించి, నీకు ముఖోల్లాసంబుఁ జేయుచుం బ్రవర్తింపు చున్నా రేమనవచ్చు! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 97

దేశికసార్వభౌమా! పటుతరగ్రహణధారణాది విశిష్టశేముషి నీకుఁబట్టపు మహిషి. గురుపదంబు సింహాసనంబు. సిద్ధిత్రయ, పురుషనిర్ణయాదు లాయుధంబులు. విరజ కవ్వలివ్వలిసీమలు నీ యేలుబడికి వచ్చిన దేశంబులు. శ్రీరంగ, క్షీరసాగర, శ్వేతద్వీపంబులు జలదుర్గంబులు. వనశైల, వేంకటశిఖోచ్చ్రయ, వారణమహీధర, గరుడగ్రావ, నారాయణాచలంబులు గిరిదుర్గంబులు. తక్కిన దివ్య దేశంబులెల్లా స్థల

*. ఇది "పరిషత్"–అను సంస్కృతశబ్దముయొక్క వికృతి. 'పరష, పరుస, పరస'–అనునవి దీని రూపాంతరములు. 'యాత్రికుల గుంపు'–అను నర్థమున ఈ పదము రూఢినొందియున్నది.

1. (ఉ) ఎడపడక.

దుర్గంబులు. కులదైవతంబు కురుకానగరాధిదేవత. తదారాధనఁజేయు వైష్ణవుండు మధురకవియాళ్వారు. పోషింపఁదగిన కులవృద్ధులు భూత, సరోవర, మహదాది [1]దివ్యసూరులు. జాతకము నిశ్చయించిన సిద్ధాంతి శ్రీమన్నాథమౌనులు. పురోహితుండైనకులగురువు శ్రీయాళవందారు. నిత్యచరణతీర్థప్రదుండు పెరియనంబిగారు. విజ్ఞప్తికర, మాలాధరులు విద్యాభ్యాసంబుఁ జేయించిన యుపాధ్యాయులు. పురాణవక్త శ్రీశైలపూర్ణుండు. అవసరమైనప్పు డర్థమిచ్చిపుచ్చుకోనేర్చిన మహాధన్యుండు గోష్ఠీపూర్ణుండు. హితాహితములు దెలుపఁగల వేద్యుం డమ్మంగి. మంత్రాలోచన కర్తయగు మంత్రి తిరుక్కచ్చినంబి. దళవాయి దాశరథిసూరి. రాయసము వ్రాయు చతురుండు శ్రీవత్సాంకమిశ్రుండు. తత్పుత్రులు ముక్తాతపత్రచామరములు. తదుపదేష్ట మణిమయపాదుకాయుగళి. కురుకాధినాథసూరి సంప్రతినాయకుండు. వడుగునంబి బొక్కసపుకర్త. తిరువరంగత్తముదనారు పట్టపు కవీశ్వరుండు. గోవింద, వరదరామానుజమౌనులు కొలువువిద్వాంసులు. మైమర్దనచేసే సముఖముజెట్టి పిళ్లయురంగావిల్లిదాసులు. జలకము సేయించు వెరవరి కందాళయాండాను. కట్టువర్గమిచ్చే [2]పరిశుద్ధుం డేచ్చాను. తులసీ [3]సహస్రకరమణీ తిరుమాలికా తిరుమణితిరుచూర్ణంబులు సమర్పించేవారు పిళ్లపిళ్లయాళ్వాను. [4]పరిమెళము గట్టియిచ్చే జాణ అనంతాళ్వాను. సువారపు [5]చేరువకాఁడు కిళాంబియాచ్చాను. ఆండాళను, పొన్నాచ్చియారును నివాళులిచ్చు పుణ్యసతులు. పత్తికొల్లె యమ్మాళ్లుదేవియారున్ను, కొంగినాయకిన్ని పళ్లెరముఁబెట్టి వడ్డించు దాదులు. సంగీతవిద్యారసికుం డరంగమాణి. చతుస్సప్తతిసింహాసనస్థగురునికర, సప్తశతత్రిదండసంన్యాసిబృంద, ద్వాదశసహస్రైకాంతిజనాసంఖ్యాత శ్రీవైష్ణవ యూథంబులు క్రమంబుగా రథగజాశ్వపదాతిరూప చతురంగబలంబులు. వేదాంతవేద్య, కలిజిత్కింకర, సుదర్శనభట్టారక, కృష్ణద్వయ, తత్కుమార, వాది

---

1. నిత్యసూరులు.

2. పరిశుద్ధుఁడు యచ్చాను.

3. సహస్రకమలమణిమాలికాతిరుమణి—

4. పరిమళవీటి గట్టియిచ్చే—

5. చెరువుకాఁ

అరంగమాళి.

కేసరిప్రముఖులు కార్యకర్తలైన యూథనాథులు. వరవరయోగి సిద్ధాంతరక్షకుండు. సర్వతంత్రస్వతంత్ర తత్పుత్రులు [1]సూత్రధార వందిమాగధులు. పావడలు వేయువారు, బరాబరులుసేయువారు, పరాకుదెల్పువారు, ప్రతీహారులు, పాణిదీపికాగ్రాహులు మొదలైన పరిచారకులు భక్తవరులగు నామధారులు. అన్యమతస్థులందఱు నీ మూఁకలచేతఁ బరాజితులై దాఁగి కనిపించకపోయిన శత్రురాజులు. ఈ శేష నగరంబు నీ కిరవగు రాజధాని. నీ విటువంటి మహాప్రభుత్వముగల రాయల దేవుండవని నిన్నుఁ బొడఁగని, నీవుచేయు సన్మానంబులు గైకొని, నీ కొలువుకు నిలిచిన కవీశ్వరులు మా పెద్దలు. నే వారివాఁడను గనుక నీపాదములకుఁ దగవైన వాడనే. ఎంతపనికి న్నన్ను విడనాడక రక్షించుటే నీకుఁ గీర్తిసుమీ! శేషనగరాధి నాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 98

ధర్మసంస్థాపకా! పెంటమీఁది పేలికయైనా కాలికిఁ గట్టి,యది బిరుదనుకొని, కాదన్నచో నది విడువక నిర్వహించుకొని, బిరుదుగానే సమర్థింతురఁట! తమవాకిటి సారమేయంబును దోమలు నొప్పించినచో నాగ్రహించి, పోరి పోరి పగ సాధింతురఁట గాని, విడువరఁట! దొరపాటివాఁడు తన బానిస నన్యు లవమానించినం జూచి యోర్వలేక, తన ప్రాణపర్యంతంబునకు న్నొడఁబడి కీర్తి గణించుకొనునఁట! [2]'మంటిదైనను మాయెద్దే గెల్వవలె' నను లోకోక్తి యున్నటువలెనే కదా! [3]యిట్లైన యప్పుడు నేను నిన్నంటినవాఁడను గాన, నీవు నన్నేలినవాఁడవుగావా? నీ ముందఱనే నన్నితరు లనాదరింపఁగాఁ జూచుచు న్నూరకేయుండ నీకది యుచిత మేనా? తొల్లి రాముఁడు లోకంబునం బలుకు లాలించి, తగవు దీర్చెనఁట! నీ వతని తమ్ముండవేగాన ధర్మజ్ఞుండవు; సత్యసంధుండవు. నేఁజేయు నూడిగంబుల

1. సూత్రధారులు, వందిమాగధులు.

2. మట్టిదైన మాయెద్దే

3. యని యిటులైనప్పుడు

కడ్డపడువారినిఁ గనింగానని చందంబున [1]నూరకే యున్నాఁడ; విదేమి న్ననవు. వారికి న్నాకుం దగులైన వగం దెగఁజేయు; మిదేమి యాగడమా? శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 99

శ్రీఘటితఘటనైకనిపుణా! చిత్రకూటంబు విడిచివచ్చిన గోవిందరాజులను తిరుపతిలోఁ బ్రతిష్ఠచేసి, యతని నతిశయభాగ్యవంతునిఁగాఁ జేయఁదలంచి గోదా నామంబున వ్యూహలక్ష్మిం బ్రతిష్ఠయొనర్చి, ఆవాహనంబైన వెంబడిన నతనిఁ దదగ్రకటాక్షపాత్రునిఁగా నిల్పి సంపన్నునిం జేసితివఁట! ఆ వింత యటుండ నిమ్ము. ఆ గోవిందునకు శేషాచలపతి తమ్ముఁడ ననుకొని, తన పరిజన [2]పరిభట బృందంబునెల్లం దదధీనంబు చేయుచు వర్తించు నీ వింతయేమి? అతండేయూరు? తానేయూరు? ఆ యిరువురి చేష్టితంబులుం దలపోసి చూచిన, నొకరు నీ యభిమానాంతర్భావం బాశించివచ్చినలాగు నైన్నయున్నది. పాషండసంసర్గ మసహ్యమై తోఁచి వచ్చిన లాగునైన్నయున్నది. ఒకరు నీవు శంఖచక్రాంకనప్రదుండవని నీ హృదయం బనువర్తించి నడచి, శిష్యవృత్తి చూపు చందంబు నైన్నయున్నది. కృతజ్ఞతచేతఁ బ్రత్యుపకారంబుచేసే యందమునైన్నయున్నది. అటననేల? ఇటననేల? ఎటుఁటే యోమో, నా కేమిటికి? నే బంటువాఁడను. మీ భావంబులు మీకే తెలియును. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 100

శ్రీఆప్తజనాభీష్టసంధాయకా! ప్రకృతానుసారిగా నొకటి విన్నవించెద. విన నవధరింపుము. తిరుమల తిరుపతులు నీ యధీనంబులై, తదధిష్ఠితదైవంబులు నీ యభిమానవిశేషబలంబునఁ జెలంగువారు గనుక, 'అచట గోదాసంజ్ఞక వ్యూహ

---

1. నూరకయున్నవాఁడ; వేమిన్ననవు.

2. (ఉ) పరిచ్ఛదబృందంబునెల్ల.

లక్ష్మీ విగ్రహంబునుం బ్రతిష్ఠచేయించి యీ శేషనగరంబునకుం దెమ్మని దేవర వారు దాసునకు నియమించఁగాఁ, దత్ప్రకారంబునం దిరుపతియందు విగ్రహ నిర్మాణంబు చేయించి, తిరుచాణూర నలమేలుమంగా సన్నిధానంబునఁ బ్రతిష్ఠ చేయుటకై తిరుమలయందర్చకముఖంబున సన్నిధిననుగ్రహంబునుం 1బడసిన, శాలివాహన శకవర్షంబులు వేయున్నాఱునూట పదునాలుగవదియగు ప్రజోత్పత్తి సంవత్సర ఫాల్గుణశుద్ధయేకాదశీ 2గురువారంబుతోఁ గూడిన పునర్వసునక్షత్రమందు మీనలగ్నంబున నావాహనంబుగావింపఁ జేసి, విజయంబుచేయించుకొని వచ్చినప్పుడు, పూర్వమందు స్వప్రతిష్ఠాపిత వ్యూహలక్ష్మీ సంబంధంబున గోవిందరాజులకుంబలె, మీకు తిరువారాధనంబగు వీథియారవరువారికిన్ని ఈ లక్ష్మీ సంబంధంబున భాగ్యం బతిశయించవలెనని కదా, సమక్షంబునఁ బరిణయంబు చేయించితిరి? అందుకు మీ 3సంకల్పంబే కారణంబు. భాగ్యంబులును రాఁగలవని కనిపించే యున్నవి. ఈ వ్యూహలక్ష్మికిం బుట్టినిల్లు తిరుచాణూరే యౌటచేత 4నలమేలు మంగనాచ్చారు అక్కయుం దాఁజెల్లెలుం గనుక, శేషనగ శేషనగర నివాసులగు కోనేటిరాయఁడును గోపాలరాయఁడును తోడియల్లుండ్లయిరి. 5ఇంత బలిమి యున్నప్పు డన్ని విభవంబులుం దమంతట తామే వచ్చును. తిరుపతి చందంబున మఱయగాండ్లచేతి బాధ లంటే విభవము 6మాత్రమే రానీయకు; రానీయకు; ఇది నా మనవి. కోవెల శ్రీవైష్ణవుల యధీనంబుచేసి, సమస్తైశ్వర్యంబులనుం గలుగఁజేయుము. 7అఖిలాచార్య పురుషులకు నీన్నివే యభిమతంబు. మఱచేవు సుమీ! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1. (ఉ) బడసి,
2. గురువారంబునఁ జేరిన పునర్వసూనక్షత్రమందు
3. సంకల్ప కారణంబున భాగ్యంబులు రాఁగలవని కనిపించి యున్నది.
4. (ఉ) అలమేలుమంగకుం దాఁజెల్లెలు గనక,
5. ఇట్లుబలిమి.
6. (ఉ) ఏమాత్రము రానియ్యకు; రానియ్యకు; రానియ్యకు.
7. (ఉ) అఖిలాచార్యులకు న్నదె యభిమతంబు.

## 101

[1]సమజ్జనమనోరథప్రపూరకా! జ్ఞానమంటపంబగు తిరునారాయణపురంబునందు సంపత్కుమారుల కైంకర్యంబుఁ జేయుకొఱకు యాభైయిద్దఱిని [2]స్వశిష్యులను నెలవు చేసి నిలిపి, మగుడి శ్రీరంగంబునకుఁ బయనంబైన తఱిని మీవిశ్లేషంబున కోర్వఁజాలని వారి పరమభక్తిదశ నవలోకించి, స్వాకృతి ప్రతికృతికి నియమించి, నిర్మాణశాలయందుఁ దద్విగ్రహభుజద్వయంబున శిల్పి శంఖచక్ర లేఖాలేఖనంబుఁజేయు ముహూర్తమందే మఠంబులో గోష్ఠిమధ్యమందు హఠాత్కారతలంబుల భుజమూలంబులు గప్పుకొని, 'నాఁడే పెరియనంబి కృపచేసిరి; నేఁడేల తిరిగి?' న్నని [3]యానతిచ్చి తదాకారంబు సాక్షాత్స్వాకారంబే యనుటకు నిస్సంశయంబుచేసి, పూర్వనిర్మాణ సమయానంతరంబున నాలింగనద్వారా స్వశక్త్యావాహనము న్నొనర్చి, వారికి నమ్మిక పుట్టించుకొఱకుఁ దద్విగ్రహంబునందుండి ప్రత్యుత్తరం బుగ్గడించిన గతిం గనిపింపంజేసి, వారిని సమ్మతింపించిరఁట! ఇందుచేత స్వయంవ్యక్తంబైన యందంబే కనిపించె. మోక్షదశనుంబలె మీ జ్ఞానవిభుత్వముం బ్రత్యక్షమయ్యె. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 102

అసంకుచితజ్ఞాన వైభవా! స్వయంవ్యక్త, దైవ, సైద్ధ, మానుషభేదంబున భగవంతునకుఁ జతుర్విధంబులగు నర్చావతారంబులవలె, మీయర్చారూపంబులుం దత్ప్రకారంబునఁ జతుర్విధంబులయ్యె. అదెట్లన్న, నారాయణాచలంబునం దాత్మ సంకల్ప కల్పితరూపంబున స్వయమేవావహించుటంజేసి అది స్వయంవ్యక్తంబు. శ్రీరంగంబున భవద్వియోగాసహిష్ణు తద్వల్లభ విష్ణు ప్రతిష్ఠాపితరూపంబగుట నది దైవంబు. శ్రీమహాభూతనగర శ్రీవేంకటాచలంబుల సమకాలమందె సర్వతపోతిరిక్త న్యాసాఖ్య తపస్సిద్ధమహర్షి ప్రతీకాశ దాశరథికుమారానంతసూరివర ప్రస

---

1. ఆప్తజనాభీష్ట సంధాయకా!
2. (ఉ) స్వశిష్యులం బనుపు చేసితివి. మగుడి—
3. శిష్యున కానతిచ్చి.

స్వీకృతరూపంబులు గనుక అవి సైద్ధంబులు. ఈస్థాన చతుష్టయంబునుందక్కఁ తక్కిన సమస్త దివ్యదేశంబులందునందునుం గల దివ్యరూప పంక్తితోఁగూడ, ముందటి కల్పపర్యంతముం భక్తమూలంబులై ప్రతిష్ఠాపితంబులు గాంగల రూపంబులెల్లా మానుషంబులు. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 103

రంగనాథప్రియా! ఉభయవిభూతి నాయకత్వాధికారం బొసంగిన రంగనాయకులు మీకుఁ గాలత్రయ వాసయోగ్యంబుగా నగరత్రయంబు మొదలనే సంకల్పించెనని నామానసంబున విచారించినం గనిపించె. అదెట్లంటివా? విన నవధరింపుము. అవతారదేశంబగుటచేత బాల్యాతిక్రమణ పర్యంతవాసయోగ్యంబయ్యెఁ గావున, శ్రీమహాభూతనగరంబు భూతనగరంబయ్యె. స్వదత్త విభూతిద్వయనిర్వహణంబుఁజేయుకొంటకుఁ గల్పపర్యంతమున్న [1]విడుమంటిచోటు శేషనగరంబెయని శ్రీరంగరాజాభిప్రాయంబుగాఁ దెలిపి, [2]సారె మీరిచటికి రాఁదలంచినం గని *"యావచ్ఛరీరపాతమత్రైవ శ్రీరంగే సుఖమాస్వ!" యని అతండె నియమించెఁ గావున, సర్వావతారభావాంగీకార పర్యంతం బటువలె నచ్చటనె వర్తించుటంజేసి రంగనగరంబు వర్తమాన నగరంబై, తత్కాలంబున కీ శేషనగరంబు భవిష్యన్నగరంబయ్యె. అందుకు మీ రీ కాలంబునఁ బరిపూర్ణవ్యాప్తిచేత దివ్యశక్తిఁ గనిపింపంజేసిఁ శ్రీ మహాభూతనగర శ్రీ రంగనగరంబులవలె నిఖిలగురుజనోద్దేశంబగునట్లుగా మీ ప్రభావంబులు చూపుచు న్నిచ్చోట వర్తింపుచున్నాఁడవుగనుక, నదె సిద్ధమని తెలిసెనె! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1. విడిది చోటు; (ఉ) విడిపట్టుచోటు
2. (ఉ) నాడె మీరిచ్చటికి

*. ఈ సంస్కృత వాక్యము భగవద్రామానుజముని ప్రణీతమైన 'శరణాగతిగద్య' యందలిది.

## 104

భక్తజనచింతామణీ! వైకుంఠ, క్షీరసాగర, వారణాచల, వేంకటశైల, వనగిరి ప్రముఖ స్థలంబులు శ్రియఃపతికి నవతారస్థానంబులని పెద్దలందఱు న్నందురు. అతఁడా దివ్య దేశంబులతోఁగూడ వచ్చి, నీయంతరంగములోఁ బ్రవేశించి నిల్చియున్నవాఁడు. అట్టి నిన్నొకమాఱు సేవించి ప్రదక్షిణంబు చేసిన మాత్రంబున, నన్ని తిరుపతులను సేవించినవారమే యౌదుమని యగుటంజేసి, వివేకించ నేర్చినవారికి నూటయెనిమిది తిరుపతుల యాత్రాఫలంబులు నీ కిరవగు నీ శేషనగరంబె యొసంగఁ గలదు. ఇచట వసియించిన జనుల పుణ్యంబు లగణ్యంబు లహో! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 105

అపార కరుణాంబుధే! అసద్వస్తువునైనా నాయందు అకారణసౌహార్ద ముంచి జాయమాన కాలంబునఁ గటాక్షించి, జననానంతరంబున రామానుజాచార్యులనే పేరుపెట్టి నియమించి, స్వకీయతాభిమానంబునఁ బోషించి, సన్నిధికి రప్పించుకొని పేరొప్పగింపఁజేసికొంటివి. ఉపనీతునిఁగాఁజూచి, పంచసంస్కార సంపత్తికై పరవస్తుకులపారావార కౌస్తుభంబగు తిరువాయిమొళి ప్పెరుమాళ్ నైనారు నాశ్రయింపఁజేసితివి. గృహస్థభావంబు నొందించి, నీవే తండ్రివై కృపామాత్ర ప్రసన్నాచార్యత్వంబున నఖిల సంప్రదాయార్థంబులెల్లఁ దెలిపి, నీనిజశక్తి నాయందె నిలిపి, యంతరాత్మవై, నీదాసులకు దాసునింజేసితివి. అనవరతంబు నీయభ్యుదయంబులె మనోరథింపంజేసి, మానసంబు నీదిగాఁజేసికొంటివి. నీ విషయంబుగా నాంధ్రగీర్వాణ ద్రావిడకర్ణాటాది భాషామయంబులైన గద్య పద్య సంకీర్తనాత్మకానేక కృతులు వెళ్లనాడుటకు బుద్ధియిచ్చి, వాచకంబును నీకే శేషంబు చేసికొంటివి. నీ యూడిగపుఁ [1] బనులఁ దలఁపఁ జేకాయకంబునఁ [2] వినియోగించుకొంటివి. నా హానివృద్ధులు నన్నంటనీయక, నీవిగాఁజేసికొని వ్యవహరింపుచున్నవాఁడవు. నాకేమిచింత? నీ వెటువలె నాడింతు, నటువలె నే నాడఁగలవాఁడను. ఇది యథార్థము; యథార్థము. శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1. (ఉ) పనుల కలవఱిచి, చేకాయకంబున.
2. వినియోగపఱచుకొంటివి.

## 106

ఆనందస్వరూపా! [1]ఇన్ని విన్నపంబులకుఁ దలకట్టైన విన్నపంబొకటి విన్నవించెద. [2]ఏ దేశంబులనైనా వసింపఁజేయుము. ఏ జన్మంబులనైనా గలుగ సంకల్పింపుము. ఏదుఃఖంబులనైనా బెట్టుము. అందుకేమియు న్వెఱవ. నీ దాసులందఱు న్నన్నభిమానించి. [3]నాచే నూడిగంబులు గైకొనేటట్లనుగ్రహింపవలెను. ఇది లేని యైశ్వర్యంబునుం గోర. ఆత్మానుభవము నొల్ల. భగవల్లాభంబైన నపేక్షింపను. ఇది సత్యంబు. ఇందులకేమి ప్రమాణం బిమ్మన్న నిచ్చెద. మీ శ్రీపాదంబులాన! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

## 107

ఆత్మీయజన [4]రక్షైకదక్షా! నీ నగరంబున సుహృజ్జనంబులతోఁ గూడి, సంసారదుఃఖం బెఱుంగక, యావజ్జీవనమ్ముం ద్వదీయ దివ్యప్రబంధ పరిశీలనంబులచేఁ గాలంబు గడుపఁ జేయుము. మీ వదన చంద్రోదిత మందహాస చంద్రికాపరంపరలు నా నయనచకోరంబుల కబ్బఁజేసి హర్షింపఁజేయుము. దేవర వారి దివ్యావయవలావణ్య వర్ణనాత్మక పావన సరోవర విహారంబు నా మనీషా మరాళికి లభింపఁజేయుము. మామక మనోమిళిందంబునకు విందు తావక చరణార వింద నిష్యందమాన మకరంద రసాస్వాదంబుగాఁ గరుణించుము. భవదీయ మందిర కైంకర్యంబు లెడపడక సవరించుట కధికారం బొసంగుము. మీ వారందఱు న్నన్నభిమానించుటకుఁ దద్దయాపాత్రునిఁగా నొనర్చుము వారల యెడల నపచారంబులు ఘటింపకయుండునట్లు వర్తింపఁ [5]జేయుము! శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!

---

1. ఇన్నివిధంబుల విన్నపంబులకు
2. ఏ దేహంబులనైనా
3. (ఉ) నియమించి, నియమించి నాచేత నూడిగంబులు.
4. రక్షణ కటాక్ష!; (ఉ) రక్షైక దీక్ష!
5. జేయుము, స్వామీ! శేషనగరాధినాథ!

# 108

శ్రరణాగతాపరాధానభిజ్ఞా! అడియఁడ, నాత్మగుణవివర్జితుండ, ననాత్మ గుణపరిపూర్ణుండ, నజ్ఞుండను. తప్పులనక, నా యీ విన్నపంబు 1 లింపుగా నంగీకరించి యనుగ్రహింపుము. లోకమం దర్భకుల యవ్యక్త భాషణంబులు తప్పులుగాఁ గొనక, మాతాపిత్రాదులు ముద్దుచేసికొని మఱి మ్మఱి న్వినఁ గాంక్షింతురు గదా! అట్ల నేను బాలుండను. నీవు పరవస్తువిఖ్యాతి నొందిన 2 వేంకటాచార్యుల రూపం బమరి నన్నుఁగన్నవాడవు. రక్షించు తండ్రివి. పోషించు తల్లివి. మెచ్చు దొరవు. ఇచ్చు దాతవు. తోడగు బంధుండవు. జోడగు మిత్రుండవు. అఖిలంబును న్నీవే. నన్ను నీ కారుణ్య శీతల కటాక్షామృత ధారా పరంపరలం గ్రమ్ము. నీహృదయంబు నా కభిముఖంబు గావిమ్ము. కైంకర్య విరోధులం బోఁ జిమ్ము. నీయూడిగంబులు చేయుట కనుమతి యిచ్చి, కైకొమ్ము. కైకొని ప్రసన్నుండవు గమ్ము. శేషనగరాధినాథ! రామానుజ, నమో నమో యతిరాజశేఖరా!

## గద్య

ఇతి శ్రీ మద్రామానుజ పద భక్త్యార్చనాధురీణ భగవద్భాగ మహా కైంకర్యాభిధాన శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంత ప్రవర్తకారోహణ శ్రీమదిల్లింద(ల) వేంకటాచార్య సత్పుత్ర రామానుజాచార్య ప్రణీతంబైన రామానుజాలు శ్వాశత ప్రబంధ పరికల్పిత పరవస్తుప్రకాశ నిఖిల ముముక్షు వరాయణ పరంపరా సంపాదిత పరమపద ప్రాప్తంబగు శ్రీమద్గురు ప్రశంస దాస్యానుకూల శ్రీపాదతీర్థ తళియ ప్రసాదా(ది స్పర్శవేది)ప్రభావ సంపన్నంబును, నాథ యామున పరాంకుశ మహానుభావ సంస్తుతి స్తోత్రంబులును. శ్రీరంగ వేంకటాచలాహోబలాది భగవత్ స్థల విన్నయ నిర్మాణ నిపుణ మహాసముద్ర ముద్రిత మహోత్సవంబులును, శృంగేరి శారదాపీఠ పదస్థ మత్తగజంబుల రామానుజనామ సింహామర్దితంబులును, జైన చార్వాకపాషండ మతఖండనంబులును, అజామీళో

---

1. (ఉ) లింపులుగా
2. (ఉ) వెంకటాచార్య రూపంబమరి.

పాఖ్యానంబును, తింత్రిణీమూల నివాస వకుళాభరణ యోగీంద్ర మహాప్రభావంబులును, భూతపురి నిలయంబును, శేషనగరంబున రామానుజ నివాసంబును, శ్రీవైష్ణవగణ త్రిదండ సన్న్యాసి సమూహ పరిమాణంబులును, (పర) దేవతా దూషణంబులును, నాలాయిర ప్రబంధాది ద్రావిడ వేదసూత్రంబులును, జ్ఞానాధికారుల లక్షణంబులును, భక్తిప్రపత్తి తదుపాయ మోక్షంబు నన్నది విన్నప మష్టాశత పరిమాణంబున్నైన రామానుజామృతంబునం దేకాశ్వానము.



# శ్రీ అనుబంధము

## *నవరత్న విన్నపములు

## 1

ఉభయ విభూతినాయకా! మీరు దామోదర గోపురంబెక్కి తిరుమంత్ర రహస్యంబు సకలాత్మలకు పంచిపెట్టేటప్పుడు అడియేనిని యేమైయుంటినోగాని యెఱుంగను. ఖేచర, భూచర, స్థావర, జంగమాదులలో నొక జంతువై యుంటినో గాని యెఱుంగను. నిరాకారంబైన పిశాచత్వంబున చరియించుచుంటినో గాని యెఱుంగను. ఈ జన్మంబున నరుండనై జన్మించఁగలిగె. మీ శ్రీసూక్తులు నా వీనుల వినఁగలిగె. మీ దాసుల సన్నిధిని మెలంగఁగలిగె. మీ శ్రీ పాదతీర్థ శేష ప్రసాదంబులు నా జిహ్వకు స్వీకరించఁగలిగె. ఇందుకే యాశ్చర్యంబయ్యె నేని దోషభోగ్యత్వంబు మీయందే కలదు. గనుక మీ కృప యెటువలె ఫలించునో, యీ సంశయంబు ఏర్పడ నావ తియ్యవే! శ్రీ భాష్యకారోత్తమా!

---

* 'శ్రీ భాష్యకారోత్తమా!' – అను మకుటముగల ఈ తొమ్మిది స్తుతి వచనములు, 'యతిరాజశేఖరా!' – అను మకుటముగల తరువాతి స్తుతివచనము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ గ్రంథాలయ మున గల యొక ప్రాచీన ముద్రిత పుస్తకమునుండి గైకొనఁబడినవి. ఈ పది వచనములు విషయమునందును, రచనారీతిని 'యతిరాజశేఖర వచనముల'ను పోలి యుండుటచే నిచ్చట సమకూర్పఁబడినవి. ఈ ప్రాచీన పుస్తకమున లాలి వార్తలు, ధాటీ పంచకము, యతిరాజులవారి వ్యాఖ్యా తిరునామములు – మున్నగు మఱికొన్ని లఘుస్తోత్రము లున్నవి. ఈ గ్రంథమును గూర్చిన తదితర వివరములు తెలియవు.

## 2

యోగి పుంగవా! ఎత్తని పెక్కు జన్మంబు లెత్తితి. నేఁ జేసిన ద్రోహంబు విచారించ దొరల తరమైనా చాలునా? నా తనువు కొఱఁతవేయ నరపి చూడ, నాలోని యపచారంబులకు అనేకమైనా చాలునా? నాలో నేను చేయు భాగవత పరిభవంబులకు హరియైనా నోపునా? ఆచార్యులు నా కొఱఁతను దెలిపి, వన్నాదరించి, యిట్టి దురాత్ముండని యెంచక చరమతెప్ప గట్టించి, విష్ణుమాయా వార్ధి విడుదలఁ జేయించిరి. శరణాగత బిరుదుం జేకొన్న కరుణాసముద్రా! హే కారుణ్యమూర్తీ! పరమకృపాపాత్రా! శ్రీ భాష్యకారోత్తమా!

## 3

భక్తసులభా! నీ ప్రభావంబుఁ గొనియాడ బ్రహ్మాదుల కశక్యంబు. భూపతి కొమార్తెను బట్టిన బ్రహ్మరాక్షసిని విడిపించి, మోక్షంబు ప్రసాదిస్తిరి. "శివాత్పరతరం నాస్తి" అన్న చోళునిఁబట్టి మీ శిష్యునిచేత గెలిపిస్తిరి. చెర బోయిన చెల్వప్పిళ్ల రాయనిఁ దెచ్చి సింహాసనస్థునిఁగాఁ జేయిస్తిరి. శ్రీ భాష్యాది రహస్యంబు లుద్ధరించి పిద్ధాంతకర్తలైతిరి. విష్ణుదర్శనంబు విలువఁ జేస్తిరి. శ్రీ వేంకటేశ్వరుని మీ శిష్యునిఁగాఁ జేసికొంటిరి. ఇటువంటి మహాత్ములు మీరు! మీ ప్రభావంబుఁ గొనియాడ నే నెంతటివాఁడ? అధమాధముండను; అజ్ఞానజంతుండను; నరపశువను. నా నేరము లెంచక నన్ను రక్షించుటే ఘనము. శ్రీ భాష్యకారోత్తమా!

## 4

మాయావాది కోలాహలా! చతుర్భుజుండైన నారాయణుండు కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగంబులందు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్క్యాది దశావతారంబులు మొదలుగా జన్మించి, శరణాగతులైనవారిఁ గాచి సంసారబద్ధులంజేసెఁగాని, తన నిజరూపం బొసంగలేఁడాయెను. మీరున్ను కలియుగంబున తిరువవతరించి, సకలాత్మలకు మామేకార్థంబు దెలిపి, శేషత్వ, పారతంత్ర్య, కైంకర్యంబులు దెలిపితిరి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంబులు విడిపిస్తిరి. రక్షకా! యిటువంటి రక్షకులు, ఇటువంటి మహాత్ములు, ఇటువంటి దోషభోగ్యులు ఎందుఁ గలరే! శ్రీభాష్యకాలోత్తమా!

## 5

త్రిదండపాణీ! షడ్దర్శన ప్రకారంబునఁ దెలిపికొంటిని. జఱుగుట, వెళ్లుట యివి నరకహేతువులని వింటిని. జైన, చార్వాక, పాషండ మతంబుల

వలన జన్మహేతువులని వింటిని. హరి హర బ్రహ్మాదులచేతఁ బడసిన వరంబుల వలన బహుభంగులరు చెడ్డారని వింటిని. నరకాసుర, బాణాసుర, భస్మాసుర ప్రముఖులు రుద్రునిచేత వరంబులు వడసి గర్వాంధులై చెడ్డారని వింటిని. * వ్యాస, పరాశర, నారద, శుక, శౌనక, రుక్మాంగద, అంగద (అర్జున ?), హనుమంత, విభీషణాదులు విష్ణువుచేత వరంబులు వడసి స్థిరకాల జీవులై యున్నారని వింటిని. మీరు ఇచ్చేటి వరంబులు కోటిసూర్యప్రకాశంబైన పరమ పదంబుఁట! అనంత కల్యాణగుణవైభవంబులు అనుదినము సేవించఁ గనుచు, ఆదిలక్ష్మీ స్తన్యపానాదులు గ్రోలుచు సుఖాసీనులై యుండఁగలరని మా యాచార్యులు ఆ చందమానతిచ్చిరి. మీరే దైవంబని కొలిస్తిని. శ్రీ భాష్యకారోత్తమా !

6

శ్రీ పరావతారా ! అన్ని జన్మంబులలో నే నెత్తని జన్మంబు లేదు. అఖిల వస్తువులలో నే భుజియించని వస్తువు లేదు. ఇన్నిటికిన్ని శేఖరంబుగా ఈ జన్మంబున నరుండనై నవమాసంబులు గర్భనరకంబుల అనుభవించి వెడలివచ్చి, వివేకంబెఱుంగక యేమి భుజియించితినో కాని యెఱుంగను. అంతట అన్న పానాదులు భుజియించి కామక్రోధాదుల మించి నిన్నెఱుంగలేనైతి. మా యాచార్యులు నా మీఁదఁ గృపయుంచి భగవత్సంబంధంబు ప్రసాయించిరి. నా లోని ప్రకృతి యెడఁబాపిరి. భాగవతసహవాసంబు లభించెను. నా భాగ్యంబేమని వర్ణింతునే ! శ్రీ భాష్యకారోత్తమా !

---

* 1. శ్లో ॥ అశ్వత్థామా బలి ర్వ్యాసః హనూమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ షడేతే చిరజీవినః

ఈ శ్లోకమున పేర్కొనఁబడినవారు చిర-జీవులు.

2. శ్లో ॥ ప్రహ్లాదనారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాది
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥

ఈ శ్లోకమున పేర్కొనఁబడినవారు పరమ భాగవతులు.

పై వచనపంక్తిలో ఈ యిరు తెఱఁగుల మహనీయులు కలగాపులగముగా పేర్కొనఁబడియున్నారు.

## 7

చరమశేషీ! జీవుండు ఎనభైనాలుగు లక్షల జీవరాసులయందు జన్మించి సుజ్ఞానిగా నేరఁడాయెను. అజ్ఞానమాయాప్రకృతులలో తిరిగేటి జంతువులకు మీరు ఏమి యుపాయంబుఁ జేస్తిరోకాని, యెఱుంగను. మీరు తిరుమంత్రద్వయ, చరమశ్లోకంబులు అనతిచ్చి మీ చరమకైంకర్యపరునిఁ జేపి మీ దాసుల శ్రీ పాదాబ్జంబులకు లంకెఁబెట్టి యిఁక జన్మాదుల పాలుగాకుండా రక్షింపవే! శ్రీ భాష్యకారోత్తమా!

## 8

రామానుజా! చతుర్దశభువనంబులు తనలో నుంచుకొన్న మాధవునకు మీరు పాన్పై యుంటిరి. అతఁడు కార్యార్థంబుగా భూలోకంబున మానుష గర్భంబున జనియించినప్పుడు అతని సహోదరుఁడైతిరి. అతఁడు పదునాలుగేండ్లు వనవాసంబుఁజేసిన, అతనికి కందమూలఫలంబులు దెచ్చి పోషిస్తిరి. అతనికి విరోధులైన ఇంద్రజిదతికాయాదుల సంహరిస్తిరి. ఈ రీతి భగవానుల యిరుగడలఁ గాపాడితిరఁట! మముబోటి బద్ధజీవులఁ గాపాడుట యాశ్చర్యం బేమి? శ్రీ భాష్యకారోత్తమా!

## 9

పరమపదనాయకా! నాలోని ప్రకృతులు విన్నపంబుఁ జేసికొంటిని. విననొధరించవే!: "ఆచార్యో హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః" అనియెడి యర్థంబు మనస్సునఁ బెట్టక, నరరూపేయని చింతించితిని. తదీయారాధనఁ జేయుటే మోక్షంబని యెఱుంగక, జిహ్వాచాపల్యంబులచేత దేహంబు పెంచితిని. పరస్త్రీ పరనిందా పరధనాపేక్షలు బహుపాతకంబని యెఱుంగక, భ్రమలఁ బొరలి తిరిగితిని. భాగవతోత్తములతో బొంకితిని. ఇట్టి యపచారములు ఎన్ని జేస్తినోకాని యెఱుంగను. ఇందుకే చింతించెదను. మీరు ఏలికవుగదా; నేను మీ సేవకుండను. గనుక నేఁజేసిన యపచారంబులు మీకు విన్నపంబుఁ జేసికొంటిని. ఇఁక మీ చిత్తము నాభాగ్యము. శ్రీభాష్యకారోత్తమా!

## 10

లీలావిభూతినాయకా! నిత్యవిభూతి మూఁడుకోట్ల ముప్పది రెండు వేల యోజనంబులు దాటఁగానే, ఆవల అమరావతి పట్టణంబు దాటఁగానే, ఆవల అండజ (అండపిండ ?) బ్రహ్మాండంబులు దాటఁగానే, ఆవల చంద్రమండలంబు దాటఁగానే, ఆవల సూర్యమండలంబు దాటఁగానే, ఆవల నక్షత్రమండలంబులు

దాఁటఁగానే, ఆవల ప్రకృతి, విక్రభుక్తి(?) దాఁటఁగానే, ఆవల కారణ వైకుంఠంబులు ఆఱుంగలవు. (ఆ) ఆఱుం దాఁటఁగానే విరజానది; విరజానదిలోపల నొక తామర కొళము గలదు. (ఆ) తామర కొళములోపల నొక మండపంబు కలదు. ఆ మండపంబులోపల వెయ్యి శిరస్సులు, రెండువేల జిహ్వలు గలియొక ఆదిశేషుండు గలఁడు. ఆ శేషుండు పాన్పయి, పడిగె గొడుగయి, ఆ పాన్పుపయి శ్రీభగవాన్లు పవ్వళించియుండఁగా, శ్రీ మహాలక్ష్మిదేవి, శ్రీభూదేవి, శ్రీ నీళాదేవి - యీ ముగ్గురున్నూ పాదము లొత్తుచుండఁగా, శ్రీ భగవాన్లు చూచి యేమని చెప్పుచున్నారు: 'నా దాసులు నిర్భయులు. నా దాసులు వేదాంత వేద్యులు. నా దాసుల గుఱుతెఱుంగుట నన్ను గుర్తెఱుంగఁబనిలేదు. ఆకాశంబు విరిగిపడ్డ ఆనవచ్చును. భూమి పగిలినా పొదుగు పొదుగ వచ్చును. సముద్రంబు పొర్లివచ్చినా కట్ట కట్టవచ్చును. ఇట్టి భాగవతుల కపచారంబు చేయుట అభుక్తఫలంబని వేద, స్మృతులు అయిదున్ను చాటి చెప్పుచున్నవి. చరమ శ్లోకార్థంబనే పాదు కలిపి, ద్వయార్థంబనే విత్తనంబు నాటి, తెల్లంబిగా(?) కాలువలు దీర్చి, జలంబు లార్చి(న), సద్వేదమంత్రంబుచేత తీఁగె పారి, పువ్వు పూచి, కాయ కాచి, పండు పండి, పంచ సంస్కారపరుండౌట నా దాసుండౌట.'

(అటుగనుక), "అస్మద్గురుభ్యోనమః" అనుటకంటె మిక్కిలి మంత్రంబు లేదు. శ్రీపూర్వాచార్యులకంటె మిక్కిలి ఆచార్యులు లేరు. శ్రీ మహాలక్ష్మికంటె మిక్కిలి దేవత లేదు. శ్రీ భగవాన్లకంటె మిక్కిలి దైవంబు లేదు. నమో నమో యతిరాజశేఖరా ! *

---

* 'యతిరాజశేఖరా !' — అను మకుటము గలిగిన యీస్తుతి వచనము రచనాధోరణియందు 'సింహగిరి నరహరి వచనముల' ను పుణికి పుచ్చుకొన్నదై, మకుటముచే 'యతిరాజశేఖర వచనముల' ను స్మరింపజేయుచు, తత్ప్రభావ, ప్రచారములను చక్కగా ప్రకటించుచున్నది.